## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి, అంతేగాక విలువైన గ్రంధాలు సరైన సంరక్షణ లేక కనుమరుగైపోతున్నాయి, కనుక మన అందరి కోసం భారత ప్రభుత్వం పురాతన ఆధ్యాత్మిక గ్రంధాలను సంరక్షించే నిమిత్తం ఎంతో శ్రమతో కంప్యూటరీకరణ ద్వారా ఒక చోట చేర్చుతూ ఆన్ లైన్ చేయటం జరిగింది. ఇటువంటి విలువైన జ్ఞాన సంపదను మరింత సులభంగా అందుబాటులోకి తీసుకురావటానికి సాయి రామ్ సేవక బృందం ఉడతా భక్తి గా ఇప్పటివరకి దాదాపు **5000** పుస్తకాలను వివిధ వర్గాలుగా విభజించి PDF(eBOOK) రూపంలో ఆన్ లైన్ లో ఉచితంగా అందించటం జరిగింది. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం అందించిన భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా http://www.new.dli.ernet.in), ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in), మైక్రోసాఫ్ట్ వెబ్ సైట్(http://www.microsoft.com) కు మేము ఋణపడివున్నాము.అలాగే ఇటువంటి బృహత్తర కార్యక్రమానికి పెద్ద మొత్తం లో గ్రంధాలను అందించిన తిరుమల తిరుపతి దేవస్థానమునకు కూడా మనం ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in లేక http://www.dli.ernet.in
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com
సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement
సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంద వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

ఈ గ్రంధపు భారత ప్రభుత్వ డిజిటల్ లైబ్రరీ గుర్తింపు సంఖ్య: 2020120001320

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్ధం **ఉచితంగా eBook** రూపంలో భారత ప్రభుత్వపు సహాయంతో ఇవ్వడం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు రచయిత,పబ్లిషర్స్ కి గలవు, కనుక వారిని సంప్రదించగలరని మనవి చేసుకొంటున్నాము.

**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాధ పాద సమర్పణమస్తు *

# భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

## http://www.new.dli.ernet.in

Digital Library of India: Inc ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers
Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

**Title Beginning with.**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Author's Last Name**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Year**

| 1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951- |
|---|---|---|---|---|---|---|

**Subject**

| Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects... |
|---|---|---|---|---|---|---|---|---|

**Language**

| Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu |
|---|---|---|---|---|---|---|---|---|

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# సంభవామి యుగేయుగే

(నాటకం)

రచయిత

డాక్టర్ కన్నెకంటి రాజమల్లాచారి

ప్రచురణ

**సరోజా ప్రచురణలు**

నరసరావుపేట

౧౨
92
1.96

# కృతజ్ఞతలు

శ్రీ మద్విరాట్ పోతులూరి వీరబ్రహ్మేంద్రస్వామి చరిత్ర చలన చిత్రంగా నిర్మించి, బ్రహ్మేంద్రుల వేషాన్ని అపూర్వంగా ధరించి దేశానికి ధర్మ బోధచేసిన శ్రీ డా యన్. టి. రామారావు గారికి,

శ్రీ వీరబ్రహ్మేంద్రుల మతానికి అధ్యక్షులై స్వామివారి బోధలను ప్రచారంచేస్తూ నావంటి రచయితలను ప్రోత్సహించి ఆదరిస్తున్న

శ్రీశ్రీశ్రీ వీరభోగ వసంత వేంకటేశ్వరస్వామి వారికి

నాలో అంకురించిన కవితాలత పరిమళించడానికి దోహదం చేసి నన్నాశీర్వదించి అభివృద్ధి పథంలోనికి తీసుకువెళ్లిన నా కవితా గురువులు. పద్మశ్రీ డా॥ నారాయణరెడ్డి గారికి

ఈనాటకాన్ని 'విశ్వ ప్రకాశ్' పత్రికలో ధారావాహికంగా ప్రచురించిన సంపాదకులు శ్రీశ్రీపాద రామనరసయ్య గారికి

# ఇందలి పాత్రలు

స్త్రీలు :

గోవిందమ్మ

ముత్తి

నర్తకి

పురుషులు :

వీరబ్రహ్మము

సిద్ధయ్య

కక్కయ్య

అన్నాజయ్య

పీర్ సాహెబ్

మునసబు

కరణం

గోవిందయ్య

పోతులూరయ్య

నవాబు

మంత్రి

భటులు

బాటసారులు

ఇంకా మొదలైన పాత్రలు

# శ్రీ యోజనా నాట్యమండలి, మార్కాపురం

## నటీనటవర్గం

రచయిత : డాక్టర్ కన్నెంటి, S.V.K.P. కళాశాల, మార్కాపురం,

దర్శకుడు : శ్రీ బి. అంథోని, టెలికం, మార్కాపురం.

## పాత్రధారులు - పాత్రలు

శ్రీమతి మాధవి (తెనాలి) గోవిందమ్మ

శ్రీమతి బి. ప్రభ (ఒంగోలు) నర్తకి

కుమారి శ్రీవిద్య (నరసావుపేట) ముత్తి

డా॥ కె. రాజమల్లాచారి - వీరబ్రహ్మము

శ్రీ యస్. రామలింగేశ్వర్ (మాచర్ల) సిద్ధయ్య

శ్రీ బి. ఆంథోని - కక్కయ్య

శ్రీ యస్. శాంతి సుహోత్ర (నరసరావుపేట) అన్నాజయ్య

శ్రీ బి. మోజెస్ (మార్కాపురం) మునసబు

శ్రీ యస్.కె. మీరావలి కరణం

శ్రీ యస్. యల్. శ్రీకాంత్ - గోవిందయ్య

శ్రీ యస్.ఎ.ప్రసాద్ - పోతూలూరయ్య

శ్రీ యస్. నవీన్ (మంచికల్లు) - నవాబు

శ్రీ యన్. శరభేశ్వర్ (గామాలపాడు) - మంత్రి

# సంభవామి యుగేయుగే

## (నాటకం)

### నాంది

సూత్రధారుడు :

శ్రీరమణీ ప్రియుండు శుభశీలుడు వేంకట భర్త శ్రీగుణో
దారుడు చంద్రమః కలను దాల్చిన భవ్యచరిత్రుడీశు డం
భోరుహ పత్రనేత్రుడురు పుణ్యుడు సత్వర జస్తమోగుణా
కారుడు విశ్వకర్త రవికాంతుడొసంగును బ్రహ్మతేజమున్.

(నాంద్యంతమున సూత్రధారుడు)
ప్రవేశించి

సూత్ర : మారిషా, ఇటురమ్ము.

మారిషుడు : ఇదిగో వచ్చితిని ఏమి ఆజ్ఞ ?

సూ : మారిషా! ఎందులకింత ఆలస్యము చేసితివి ?

మా : పెళ్లి భోజనమునకు వెళ్లితిని బావా !

సూ : పెళ్లి ఎవరింట ?

మా : మా యింటి ప్రక్క సాహెబు గారింట.

సూ : హరిహరి! ఏమి ? సాహెబుల ఇంట భుజించితివా ? ఎంత పని చేసితివి ?

మా : నేను భుజించుటలో విశేషమున్నది ? మన శివశర్మ కూడ విందుకు వచ్చినాడు.

సూ : శివ!శివ! శివ శర్మకు కూడ నిట్టి బుద్ధులు పుట్టినవా ? ఆహా ! కలి మహిమ. వర్ణ సంకరపు రోజులు వచ్చినవి. అది సరే మన నటి ఏమైనది ?

నటి : ఆర్యా ! ఇదిగో నేవచ్చాను.

మారి : నటీ ! ఏల ఇంత తడవు చేసితివి ?

సూ : ఏమున్నది ? నీవలెనే ఎక్కడనో పెళ్లికో పేరంటమునకో వెళ్లి యుండును.

న : ఆర్యా! నిజమే పేరంటానికే వెళ్లాను. ఎలా గ్రహించారు ?

సూ : నీ అవతారము కనిపించుటలేదా ! ఇంతకు పేరంటమెక్కడ ?

న : చంద్రయ్యగారింట్లో

సూ : ఏమేమి చంద్రయ్యగారి యింటిలో పేరంటమా ?

న : అవును చంద్రయ్య దంపతులు మతం మార్చుకొని గురుకారణం తీసుకొన్నారట.

సూ : సరి, సరి ఆ విషయములకేమిగాని సద్గురువు రాకకై ఎదురు చూచు శిష్యులవలె నాటక ప్రదర్శనకై ప్రేక్షకులు ఎదురు చూచుచున్నారు. వేషములు సిద్ధపరుపబడినవా !

నటి : ఆర్యపుత్రా ! ఏ నాటకంతో నేటి సభాసదులను రంజింపజేయాలి ?

మా : ఈ సదస్సులోని సామాజికుల నెల్లరు అలరింపజేయుట మన లక్ష్యము. అటువంటి ఇతివృత్తమును

గ్రహింపవలెను.

నటి : ఆంధ్రదేశంలోని కథేతి వృత్తాల్లో పండితపామరరంజకమైన వృత్తాంతం ఏమిటి?

సూ : విష్ణ్వంశసంభూతుడై పరమ దేశికుడై మహాకవియై ఋషియై కాలజ్ఞానియై రాజయోగియై ఆంధ్రదేశమున అవతరించిన శ్రీ విరాట్ పోతులూరి వీరబ్రహ్మముగారి జీవిత చరిత్ర పండిత పామర జనరంజకమైనది.

మా : ఈ వస్తువును గ్రహించి నాటకము రచించిన కవి ఎవరు ?

సూ : ఈ కవి సుప్రసిద్ధుడే

వరకవితా విలాసుడు నవాంధ్రకవీశుడు విశ్వకర్మ భూ
సురకుల సంభవుండును విశుద్ధ మనస్కుడు సామ్యవాది భా
సురమతి సండితుండు పరిశుభ్ర వచస్కుడు నాట్యవేది సుం
దర మృదు గానలోలుడు సదాశయుడౌ మన రాజమల్లుడే.

మా : ఓహో ! అతడు సహజకవి, నటుడు, కథాగాయకుడు, విద్యావిశారద, సాహిత్య సరస్వతి, అభినవ జయదేవ, మధుర కవేత్యాది బిరుదవిభ్రాజితుడు. కనుక ఆయన రచన సండిత పామరజనరంజకమగుట నిర్వివాదాంశము.

సూ : నటీ ! ఎద్దైన నొకపాట పాడుము.

నటి : ఏ ఋతువును గుంరించి పాడమంటారు ?

సూ : మధుమాస వాసర గీతమును ఆలపింపుము

న : ఆర్యపుత్రా! ఆలకించండి.

భాసురమ్మగు మధుమాస వాసరమున
కూయుచున్నది గొంతెత్తి గోరువంక
పికము పాడెను వనములు పిక్కటిల్ల
చెట్లుచిగురించి పూచెను చెలువు మీర
చిగురు టూయలందు నూగుచుండె శుక
బ్రహ్మ పలుకు వేద పాఠమట్లు
పూవు టొజ్జ చెంత పొందుకారణ మళుల్
పొదల యెదల యందు మెదలు పూలు
ఆమని గనినంత అవనికి పులకింత.

సూ : అవును చెలీ ! ఏమి ఆజంత్ర గాత్రముల సందడి

నటి : ఆర్యపుత్రా ! బనగానెపల్లె మఠంలో అన్నాజయ్య తత్వం పాడుతున్నాడు. భక్తులు బృదగానం చేస్తున్నారు. వెళదాం పదండి.

సూ : మారిషా ! అటులే కానిండు.

(అంతా నిష్క్రమిస్తారు)

ఇది కన్నెకంటి రాజమల్లాచారి రచించిన
"సంభవామి యుగే........"
అనే నాటకంలో నాందీ ప్రస్తావనల ఘట్టం.

# ప్రథమాంకం

(దృశ్యం-బనగానెపల్లెనేల మఠంలో భక్తజన సమక్షంలో అన్నాజయ్య బ్రహ్మంగారి తత్వం పాడుతూ వుంటాడు. భక్తులు ఆయనతో కలిసి పాడుతూ వుంటారు. తెర తొలుగుతుంది)

అన్నా : చిల్లర రాళ్లకు మ్రొక్కుచునుంటే
చిత్తము చెడిపోనొరే యొరే
చిత్తము నందున చిన్మయ జ్యోతిని
చూచుచు నుండుట సరే సరే ॥ చిల్లర ॥
ఒక్క ప్రొద్దులని యొన్నుచునుంటే
ఒనరుగచెడుదువు ఒరే యొరే
ఏకమైన ఆ వైభవ మూర్తిని
చూచుచు నుండుట సరే సరే ॥ చిల్లర ॥
నీళ్లలో మునిగి గొనుగుచు నుంటే
నిలకడ చెడునుర ఒరేయొరే
నీలో నుండే నిర్మల జ్యోతిని
చూచుచు నుండుట సరే సరే ॥ చిల్లర ॥
బాధ గురువుల పంచను జేరితె
భావము చెడునుర ఒరే ఒరే
బుద్ధిలో నుండే పున్నమ చంద్రుని
చూచుచు నుండుట సరే సరే ॥ చిల్లర ॥
వీరయ చెప్పినవాక్కును నమ్మితె
వివరము తెలియు ఒరే ఒరే వివరమందున విగ్రహమూర్తిని
చూచుచు నుండుట సరే సరే ॥ చిల్లర ॥

హరిః ఓం నాయనలారా ! వీరబ్రహ్మేంద్రుల తత్వములలోనిది అత్యంత ప్రసిద్ధమైనది. రాళ్లకు మ్రొక్కినచో చిత్తము చెడిపోవును. చిత్తములోనున్న దేవుని దర్శించవలెను. ఒక్క ప్రొద్దులున్న యెడల దేహము నీరసించును. నీటిలో మునిగి జపించినంత మాత్రమున నిలకడకుదురదు. మనస్సులో నున్న దేవుని చూడవలెను. బాధ గురువులు భావమును చెడగొట్టుదురు. అడవులలో తిరిగినచో భగవంతుడు కనిపింపడు. సహస్రారములోనున్న పరమాత్మను చూడవలెను. అని స్వామిబోధించిరి. ఇప్పుడు మనమున్న మఠమును స్వాములవారే స్వయముగా నిర్మించిరి.

రామిరెడ్డి : అన్నాజయ్యగారు ! తమ గురువర్యులు వీరబ్రహ్మేంద్ర స్వాముల జీవిత విశేషాలను తెలుసుకోవాలని కోరికగా వుంది.

సుబ్బయ్య సెట్టి : అవును స్వామి ! నాకూ స్వాములవారి గురించి వినాలని వుంది దయతో చెప్పండి.

అన్నా : అలాగుననే శ్రద్ధగా వినుడు. గంగానదీ తీరమున బ్రహ్మాండపురమను గ్రామము కలదు. అందు ప్రకృతాంబ పరిపూర్ణయ్య అను దంపతులు కలరు. వారు సంతానార్ధులై తీర్థయాత్రలకు వెళ్లిరి. కాశీనగరమున ఒకనాటి రాత్రి శివుడు కలలో నగుపించి విష్ణువు ఆమె పుత్రుడు జన్మించునని చెప్పెను. ప్రకృతాంబ గర్భము ధరించెను. నవమాసములు నిండెను. అప్పుడు వారు స్వగ్రామమునకు బయలుదేరిరి. మార్గమధ్యమున సరస్వతీనదీ తీరమున ప్రకృతాంబ మగశిశువును ప్రసవించినది.

రామి : స్వామి ! ఈ సరస్వతీనది అంతర్వాహిని అంటారు నిజమేనా !

అన్నా : ఈ సరస్వతీనది ఇప్పుడు కొన్ని తావులపైకి ప్రవహించుచున్నది. కొన్ని తావుల అంతర్వాహినిగా నున్నది. భవిష్యత్తు లోనిది పూర్తిగా అంతర్వాహినిగా ప్రవహించునని బ్రహ్మేంద్రులు కాలజ్ఞానమున తెలిపిరి.

సుబ్బ : ప్రకృతాంబ ప్రసవించినప్పుడు ఒక కాంతిమంతమైన నక్షత్రం పుట్టినది గదా!

అన్నా : అవును అప్పుడా శిశువును చూచుటకు జనులందరును వచ్చిరి. శిశువు జన్మింపగనే పరిపూర్ణయ్య మరణించెను. ఆ నదీ తీరమున అత్రి ఆశ్రమమున్నది.

రామి : అత్రి మహర్షిఅంటే అనసూయ భర్తేగదా స్మామి !

అన్నా : ఆ అత్రి మహర్షి వేరు. ఆయన ఆ పేరుగలవాడు మాత్రమే. ప్రకృతాంబ భర్త మరణమునకు చింతించి ఆ శిశువును అత్రిమహర్షి చేతులో పెట్టి పెంచి పెద్దవానిని చేయవలసినదిగా అర్థించి తన భర్తతోపాటు తానును మరణించినది.

సుబ్బ : అప్పుడు అత్రి మహర్షి ఆ పిల్లవానికి బ్రహ్మం అని పేరు పెట్టాడు.

అన్నా : కాదు నాయనా ! ఆ బాలునకు వీరనారాయణ అని నామకరణంచేసి తన ఆశ్రమమున అల్లారుముద్దుగా పెంచుచున్నాడు. అప్పుడు అత్రి మహర్షి ఆశ్రమమునకు యనమదల వీరభోజయ్య వీరపాపమ్మ దంపతులు వచ్చిరి. వారు సంతానార్థులై వచ్చిరన్న విషయమును గ్రహించి వీరనారాయణను వారికి దత్తత నిచ్చిరి.

రామి : స్వామీ ! ఒక సందేహం.

అన్నా : అడుగు నాయనా !

రామి : స్వామిని, పోతులూరి వీరబ్రహ్మంగారని అంటారు. వారి ఇంటిపేరు యనమదలఅని ఉండాలిగదా!

సుబ్బ : అవును స్వామీ! నాకూ అదే సందేహం.

అన్నా : నిజమే కాని, స్వామి పెంచుకొనిన తలిదండ్రులను వీడి కర్నూలు మండలములోని పోతులూరు గ్రామమున నివసించుటచే ఆయింటి పేరు వచ్చినది. ఆ గ్రామముననే వీరనారాయణ వీరభద్రస్వామిని అర్చించి ఆయననే తన గురువుగా భావించెను.

రా : స్వామికి వీరప్పయ్య, వీరంభట్లయ్య అనే పేర్లు ఏలా వచ్చాయి.

సు : అవును స్వామీ నాకూ అదే సందేహం ?

అన్నా : కర్ణాటకదేశమునపినాకినీ నదీతీరము పాపఘ్ని మఠమున వీరభోజయ్య దంపతులకు స్వామి దత్తుడుగా పెరిగినాడు. అచ్చట తలిదండ్రులు ఆశ్రమమున వీరంభొట్లయ్య అని పిలుచుకొనిరి. అచ్చటి ప్రజలు తమ ప్రాంతపుభాష చొప్పున వీరప్పఅని పిలిచిరి. కొంత కాలమునకు వీరపాపమ్మ వీరభోజయ్యలు మరిణించిరి. అప్పుడు వీరప్పయ్య కంచికివెళ్లి తపస్సు చేయసాగెను.

రా : అక్కడే గదా స్వామీ! ఆనంద భైరవ వర్మ అనే కాశీరాజు స్వాములవారిని దర్శించింది.

సుబ్బ : పులిని చంపబోయి గోవును చంపింది ఆయనేగద.

అన్నా : వీరంభొట్లయ్యగారు ఆనందభైరవవర్మకు గోహత్యాదోష నివారణోపాయం ఉపదేశించి పంపారు. అక్కడ తపస్సు ముగించి మన బనగాన పల్లికి వచ్చిరి.

రా : మనరెడ్డి రాణి అచ్చమ్మగారిల్లు చేరాడు.

సు : ఏవూరు తండ్రీ అని అనడిగింది అచ్చమ్మ.

అన్నా : బ్రహ్మాండ పురమని చెప్పెను.

రా : మీ తల్లిదండ్రులెవరు నాయనా అనడిగింది.

అన్నా : నా తల్లి ప్రకృతి నా తండ్రి పరిపూర్ణమని చెప్పెను. ఆమె ఇంట గోవుల కాపరిగా చేరెను. అచ్చమ్మగారి గృహమునకు చేరువగా నున్న రవ్వలకొండ ప్రాంతమున గోవులను మేపుచుండెడివాడు. నిత్యము ఆవులను ఒకగిరిలో నిలిపి కదలకుండచేసి రవ్వలకొండ గుహలోనికి వెళ్లి తాళపత్రములపై గుల్జారీముళ్లతో కాలజ్ఞానమును రచించు చుండెడివాడు. ఆయన రచించిన తాళపత్రాలను అచ్చమ్మగారి ఇంటి యావరణలోని ఒక పాతరలో వేయుచుండెడివాడు.

రా : అయితే స్వామీ ఇప్పుడు తమరివద్దవున్న తాళపత్రాలు స్వాములు రాసినవేనా !

సుబ్బ : అవును అవే.

అన్నా : కాదు నాయనా! స్వామి రచించిన కాలజ్ఞానములోని ముఖ్యాంశములను వారు మాకు బోధించుచుండగా నేనును ఇతర శిష్యులును తాళపత్రములపై వ్రాసి కొంటిమి.

సు : అయితే గోవులను మేపకుండా కాలజ్ఞానం రాశాడన్నమాట.

అన్నా : అవును ఒకరోజు ఎప్పటివలె ఆవులు గిరలో నుండి నెమరు వేయుచున్నవి. కొందరు బాటసారులకు వానిని తస్కరింపవలెనను కోరిక కలిగెను. గిరలోని కడుగు బెట్టిరి. వెంటనేవారికి కన్నులు కనిపింపకుండా పోయినవి.

రా : అయితే అది స్వాముల మహిమే.

అన్నా : అవును ఈ విషయము అచ్చమ్మగారికి తెలిసెను. తన గోవులకాపరి సామాన్యుడు కాదని గ్రహించెను. గోవులతో నింటికివచ్చిన స్వామిపదములపైబడి జ్ఞానోపదేశమును చేయుడని అర్థించినది. స్వామి అంగీకరించి అచ్చమ్మ వేంకటరెడ్డి దంపతులను, ఇతర జన సందోహమును వెంటబెట్టుకొనివెళ్లి యాగంటి కొండపై ముచ్చట్లరూపముగా తత్వోపదేశమును చేసెడివాడు.

సు : అందుకే గదా స్వామి ! దానికి ముచ్చట్ల కొండఅనే పేరొచ్చింది.

అన్నా : అవును నాయనా !

రా : అవును స్వామీ ! ఇంకొక సందేహం వచ్చింది.

అన్నా : ఎమిటో అడుగు రామిరెడ్డీ!

సు : నాకు తెలుసు రామిరెడ్డి సందేహం. వీరప్పయ్యగారికి బ్రహ్మంగారని పేరెట్లా వచ్చిందని.

అన్నా : వీరప్పయ్యగారు తమ ఉపన్యాసములలో "అహం బ్రహ్మోస్మి" అను ఉపనిషత్ వాక్యమును "నేనే బ్రహ్మమురా" యని తెలుగులో చెప్పెను. అప్పటినుండి ఈ పల్లెవాసులు ఆయనను బ్రహ్మముగారని పిలువజొచ్చిరి. ఆయనను విష్ణ్వంశ సంభూతుడని గ్రహించిన భక్తులు శ్రీమద్విరాట్ పోతులూరి వీరబ్రహ్మేంద్ర స్వాములని పిలిచిరి.

రా : అన్నాజయ్యగారూ! బ్రహ్మంగారు మన గ్రామాన్ని వదలి ఎందుకు వెళ్లారు.

సు : ఎక్కడికి వెళ్లారు.

అన్నా : ఈ మఠములో పూజాది నిర్వహణను నాకప్పగించి కుముద్వతీ తీరమున తపస్సుచేసి కొనుటకు వెళ్లిరి. అచ్చట తీరిక వేళల నొక శిలపై వీరభద్ర విగ్రహమును గండరించిరి. ఒకనాటి రాత్రి జాగ్రేరుపొంగి వీరభద్ర విగ్రహము అల్లాడుపల్లెకు కొట్టుకొని పోయి ఒక మడుగులో నిలువబడినది. ఈ విషయము తెలిసికొని స్వామి అల్లాడుపల్లె వెళ్లి అక్కడ ఆ విగ్రహమును ప్రతిష్ఠించెను.

సు : స్వామీ! బ్రహ్మంగారు ఇప్పుడు అక్కడే వున్నారా ?

అన్నా : లేదు నాయనా అక్కడనుండి స్వామి కందిమల్లయ పల్లెకు వెళ్లి గృహస్థాశ్రమమును స్వీకరించి భార్యాబిడ్డలతో అచ్చట నివసించు చున్నారు. ఆ గ్రామమున వడ్రంగము కమ్మరము చేయుచు రైతులకు వ్యవసాయపు పనిముట్లుచేసి ఇచ్చుచున్నారు. తీరిక వేళలలో వేదాంతమును బోధించు చున్నారు. ఇకముందు నేనును ఈ మఠము నా శిష్యున కప్పగించి స్వామి సన్నిధానమున నివసింపదలచితిని. నేడో రేపో బయలు దేరబోవు చున్నాను.

రా : స్వామీ ! నేనుకూడ తమవెంట ఎస్తాను.

సు : నేనుకూడా స్వామీ !

అన్నా : అలాగే నాయనా ! కందిమల్లయపల్లె మఠమునకు ప్రయాణము రేపే సిద్ధముకండు. హరిః ఓం శాంతిశ్శాంతిశ్శాంతిః

(అంతా నిష్క్రమిస్తారు)

ఇది 'విద్యావిశారద' "కన్నెకంటి రాజమల్లాచారి విరచితమైన"
'సంభవామి యుగే యుగే, అనే నాటకంలో ప్రథమాంకం'.

## విష్కంభం

(ప్రదేశం- కందిమల్లయపల్లెకు వెళ్లేమార్గం- సిద్దయ్య తత్వం పాడుతూ ప్రవేశిస్తాడు)

సిద్దయ్య: చందమామ చందమామ చందమామ
ఈ సంధి తెలిపే జ్ఞానులెవరే చందమామ ॥ చం ॥
కాయమను పుట్టలోను చందమామ
పాము మాయగానె మెలగుచుండు
చందమామ ॥ చం ॥
జంటనాద స్వరము లూద చందమామ

పాము పాదు పెకలింప వలెను చందమామ
తొమ్మిది వాకిళ్లమూసి చందమామ
పామును నెమ్మదిగా పట్టవలెను చందమామ ॥ చం ॥
రామయను కట్టుగట్టి చందమామ
పామును యుక్తిచేసి పట్టవలెను చందమామ
దేహదేహములయందు చందమామ
పాము తెలియకుండచుట్టుకొన్నది చందమామ ॥ చం ॥

(బాటలో నడుస్తున్న సిద్ధయ్యను ఇద్దరు బాటసారులు వెంబడిస్తారు)

మొదటి బాటసారి : బాబూ ! ఆగు నాయనా !

సిద్ధ : ఎవరిని స్వామి ! తమరు పిలిచినది.

రెండవ బాటసారి : ఎవరినంటావేంటి నిన్నే

సిద్ధ : ఏమి స్వామీ !

మొ.బా.: నువ్వు పాడిన తత్వం బలేగుందయ్య.

రెం.బా. : బ్రహ్మంగారి తత్వంలాగే వుంది.

మొ.బా.: ఎవరు చెప్పిందీ తత్వం ?

సిద్ధ : నేనే చెప్పితిని. వీరబ్రహ్మేంద్రుల తత్వములను పాడి పాడి పరవశించి వారివలెనే - చెప్పవలెనని ఈ తత్వమును చెప్పితిని.

రెం.బా. : ఇంతకూ నీ ప్రయాణం కందిమల్లయ పల్లెకేనా ?

సిద్ధ : అవును స్వామీ! మీరును అచ్చటికేనా ?

మొ.బా.: అక్కడికే అది మా పల్లె.

సిద్ధ : అయితే తమరు బ్రహ్మేంద్ర స్వాములను చూచితిరా!

రెం.బా. : చూడటమేంది ? అయనింటి ప్రక్కనే మా యిల్లు.

సిద్ధ : ఆహా! ఎంతటి పుణ్యాత్ములు తమరు స్వాములవారు మహిమలనేకములు ప్రదర్శించిరట మీరును చూచితిరా ?

మొ.బా.: ఎందుకు చూళ్లేదు ? అన్నీ చూశాం.

రెం.బా. : పోలేరమ్మ గుడిలో వున్న వైరాల మూకుడును గాలిలో నడిపించటం నేను చూశాను.

మొ.బా.: పాము కరిచినోణ్ణి బతికించడం నేను చూశాను.

సిద్ధ : స్మశానమునకు మోసికొనిపోవు వ్యక్తని బ్రతికించిరట!

రెం.బా. : అవును, పుష్పగిరినుండి వచ్చిన ఒకాయనకు కుష్ఠురోగం నయం చేశాడు స్వామి.

సిద్ధ : అయ్యలారా! స్వామి సమీపమున నివసించి, వారి మహిమలను కన్నులారగని, వారి బోధామృతమును గ్రోలు భాగ్యవంతులు మీరు. బ్రహ్మేంద్రులను దర్శింప నామనస్సు వేగిర పడుచున్నది. త్వరగా పోవుదము.

బాటసారులు : అట్లాగే

(నిష్క్రమిస్తారు)

# ద్వితీయాంకం

(బ్రహ్మంగారి ఆశ్రమం. సింహాసనం అమర్చి ఉంటుంది. అన్నాజయ్యా, సిద్ధయ్య కక్కయ్య మొదలైన భక్తులు, గోవిందయ్య పోతులూరయ్య బృందగానం చేస్తూంటారు.

బృందగానం

ఓయోగిరాజా! వేం చేయవయ్యా !
అసమానతేజ ! వేంచేయవయ్యా !
గోవిందమాంబతో కనువిందుకాగా
ఆనందదేవికి నందమ్ముకాగా ॥ఓ॥
నీ పాద పద్మాలు గంగమ్మ కడుగా
నీ భక్త సద్మాలు వరపరములడుగ
కనులెల్ల కలువలై కనువిందు లిడగ
అడుగడుగు దండాలునీ అడుగు బడగ
జగమంత ఎదుటబడి జయమంచు పలుక
కులము తెలియని జలము శీకరము లొలుక ॥ఓ॥
అడుగులకు మడుగొత్తి జైయంచు ఎలుగెత్తి
అనురాగములుపుట్ట జనత జైజై కొట్ట
మత మెరుంగని గాలి వింజామరలు వీచ
యతిరాజ రాజగతి పూజ గొనవయ్యా ॥ఓ॥

(గోవిందమాంబతో బ్రహ్మంగారు ప్రవేశిస్తారు)

అన్నా : జై విరాట్ పోతులూరి వీరబ్రహ్మేంద్ర స్వాములవారికి
భక్తులు : జై
వీరబ్రహ్మేంద్రస్వామి : (సింహాసనాన్ని అలంకరించి)
హరిః ఓం! అన్నాజయ్యా! ఇంత చక్కని గానముచేసినాడు ఎవ్వరీతడు.
అన్నా : ఎవ్వరో తెలియదు గురుదేవా ! తమ పాదసేవ చేయవలయునని వచ్చినాడు.
వీర : చిరంజీవీ ! నీ తల్లిదండ్రులెవ్వరు ? నీ నామధేయమేమి ?
సిద్ధ : మహాత్మా !
తండ్రి వీవుకన్న తల్లి గోవిందమ్మ ఎల్ల జగతినాకు నిల్లుదేవ
నీదు చరణ సేవ నేవేడు చుంటిని
నీకు తెలియకేమి నీరజాక్ష :
నా లౌకిక నామము సిద్ధయ్య ! మా గ్రామము ముడుమాల తమ పాతదసేవ కోరి వచ్చితిని అనుగ్రహింపుడు.

గోవిందమ్మ : స్వామీ! ఈ చిరంజీవిని దీవించి అనుగ్రహించండి.

వీర : చిరంజీవ ! నాయనా ! సిద్ధా ! ఈనాటి నుండి మన ఆశ్రమములో ఇతర సోదరులవలె నీవును యధేచ్ఛగా సంచరింపవచ్చును. శుభమస్తు.

సిద్ద : (నమస్కరిస్తూ) ధన్యోస్మి! గురుదేవా! ధన్యోస్మి.

అన్నా : గురుదేవా ! తమరీనాడు షట్చక్రములగూర్చి ఉపన్యసించి తాము రచించిన కాలజ్ఞానమును వినిపింపవలసినదిగా వేడుకొనుచున్నాము అనుగ్రహింపుడు.

వీర : అహం బ్రహ్మాస్మి! నాయనలారా ! భగవానుడు సర్వవ్యాపి ఎందెందు వెదకి చూచిన అందందే కలడు.

కలడాతడు తృణములలో
కలడాతడు కలడుగాక ఘనమును లందున్
కలడాతడు జలములలో
కలడాతడు మనుజులందు కన్నులగంటే

భగవంతుని దర్శించుటకు తీర్థయాత్రలకు పోనవసరములేదు. వెదకి చూచినచో మన దేహమునందే కలడు పంచభూతాత్మకమైన మన శరీరమునందు మొదటి స్థానమున ఆధారచక్రము గలదు. అందు గణపతినిండి యున్నాడు. గుహ్యస్థానమున స్వాధిష్ఠ చక్రముగలదు. అందు పరమేష్ఠి కొలువుదీరి యున్నాడు. నాభిస్థానమున మణిపూరక చక్రమున్నది. అందు శ్రీ మహావిష్ణువు నెలకొని యున్నాడు. హృదయ స్థానమున అనాహత చక్రము గలదు. అందు ఈశ్వరుడు గలడు. భ్రూమధ్య స్థానమున ఆగ్నేయ చక్రము గలదు. అందు పరమాత్మ నెలకొని యుండును. కంఠస్థానమున విశుద్ధ చక్రము గలదు. అందు జీవాత్మ గలడు. కపాల స్థానమున సహస్రార చక్రము గలదు. అందు సహస్ర కిరణ ప్రభలతో వెలగొందు సద్గురుమూర్తి యుండును.

కక్క : సాములూ ! నాదొక ఇన్నపం.

వీర : నాయనా కక్కయ్యా! ఏమి నీ సందేహము

కక్క : సామీ! ఇప్పుడు తమరు సెప్పిన సాములోల్లంతా మీ అసమంటోల్ల శరీరంలో గూడ కనిపిత్తరా సామీ!

వీర : వెర్రివాడా! మానవులంతా సమానమే. కులమత భేదములు మనము కల్పించుకొన్నవే. ఈనాడు నేను చెప్పిన చక్రములు అందలి దేవతలను కులమత విచక్షణ లేక స్త్రీ పురుష భేదములేక ప్రతి మానవ శరీరమునందును దర్శింపవచ్చును.

కక్క : అయితే నాకుగూడ అగపడతారా సామీ!

వీర : సందేహమేమి! నిశ్చయముగా కనిపింతురు.

గోవిందమ్మ : స్వామీ! మీరు నిరూపించిన ఆ చక్రాలను దేవతలను మేం ఎలా చూడగలమో చెప్పండి.

వీర : దేవీ! ఆ చక్రములను అధిష్ఠించిన దేవతలను నేను స్వయముగా చూపబోవు సమయముముందు రానున్నది. ప్రస్తుతము దైవ తత్త్వమును గురించి మీకు గల అనుమానములను తీర్చుకొనుడు.

గోవిందయ్య : నాయనగారూ! లోకములో మీ వంటి మహానుభావులు దేవుడున్నాడందురు. ఆ దేవుడెక్కడనున్నాడో వివరింపుడు.

వీర : నాయనా! అన్నాజయ్యా! నీవు లోనికేగి ఒక పాత్రలో పాలు ఒక దీపము తీసికొనిరమ్ము.

అన్నా : చిత్తము గురుదేవా (నిష్క్రమిస్తాడు)

వీర : చిరంజీవులారా!

పాలమీది జున్ను పగిది దైవమ్ముండు
వెన్న యందునేయి యున్న యట్లు
దండలోన దాగు దారమట్లతడుండు
ఉండికానుపింప కుండు నతడు.

అన్నా : (ప్రవేశించి పాత్రను దీపమును గురుదేవుని సన్నిధిలో ఉంచుతాడు)

వీర : ఆనందోబ్రహ్మ! నాయనలారా ! ఈ పాత్రలోని పాలనందరు చూడుడు. గోవిందయ్యా ఈ పాలలో వెన్న ఉండునా ?

గోవిం : ఉండును తండ్రీ!

వీర : నాయనా ! సిద్ధా! వెన్నలో నేయి యుండునా ?

సిద్ధ : వెన్నగాచినచో నేయి వచ్చును.

వీర : పాలలో ఇన్ని పదార్థములు కలవని మీరు చెప్పుచుంటిరి. కనిపించుచున్నవా ?

కక్క : అదేంది సామి! అట్ల సెబుతుండవ్. ఊరికనే వత్తయా అయ్యన్ని! పాలను మరగబెట్టాల. గిలకొట్టాల ఎన్నదియ్యాల. ఎన్న కాత్తే అందుట్లోనుండి నెయ్యొత్తది.

వీర : బాగుగా చెప్పితివి కక్కయ్యా! అదే విధముగా తరచి చూచిననేగాని భగవంతుడు కనిపింపడు. అర్థమైనది గదా!

పోతు : నాయనగారూ! భగవంతుని దృష్టి ఎట్లుండునో విశదీకరింపుడు.

వీర : బిడ్డలారా! ఈ దీపమును శ్రద్ధగా తిలకింపుడు.

జాతి భేదము నెంచని వీతి గలిగి
దివ్వె వెలుగులు జిమ్మును దిశల దిశల
అట్టె దేవుని దృక్కులు నమరుచుండు
కాళికాంబ పరమహంసకాళికాంబ!

గోవిం : స్వామీ! మరి భగవంతుడేం జేస్తుంటాడు!

వీర : దేవీ! భగవానుని కార్యక్రమము విచిత్రమైనది. సింహాసనము పైనున్న వానిని మట్టిలోనికి దింపును.

మట్టిలో నున్న వానికి మకుటముబెట్టి పట్టము గట్టును. మందిరమున రక్షింపబడువాని ఉసురు దీయును. అడవిలో ఆధారములేని వానికి ప్రాణము బోయును. గాతిలోని కప్పకు నీళ్లిచ్చును. మట్టిని మాణిక్యమును చేయును. దైవ లీలలు అద్భుతములు విచిత్రములు. భగవంతుని స్వభావమును దెలుపు గీతిక నొకదానిని ఇటీవల రచించితిని వినుడు.

కీర్తన

ఎంత కోరినా? ఎంత కొసరినా
ఇచ్చేది నీ ఇష్టమే - స్వామీ స్వామీ
వచ్చేది మా ప్రాప్తమే. ॥ఎం॥
అనుకున్నదంతా అయ్యేది కాదు.
అనుకోని దంతా ఆగేది లేదు
ఇంతే ఈ జగమంతా నీ లీలలే
అడవి పిట్టకు ఆధారమైతివి
ఆలింపవా నా మొర- ॥ఎం॥
మందిరాన వున్నా అందదు ఏ సుఖము
వందిరి కిందున్నా అందు సకల శుభము
మందిరాన వున్నా అందదు ఏ సుఖము
పందిరి కిందున్నా అందు సకల శుభము
ఇంతే ఈ జగమంతా నీ లీలలే
అవిశ పూలకు అందాల నిస్తివి
ఆలింపవా నా మొర స్వామీ
ఆలింపవా నామొర : ॥ఎం॥
తిండికెంతో వున్నా తిన్నదరుగదన్నా
ఆకలెంతొవున్నా ఆహారముసున్న
ఇంతే ఈ జగమంతా నీ లీలలే
చిట్టి చీమకు చిరుమేత ఇస్తివి
ఆలింపవా నా మొర- స్వామీ
ఆలింపవా నా మొర

సిద్ద : మహాత్మా ! మీరు రచించిన కాలజ్ఞానమును వినవలెనని కుతూహలపడుచున్నాము. దయతో వినిపింప వలసినదిగా ప్రార్థించు చున్నాము.

వీర : శ్రీ గురుభ్యోనమః నాయనలారా ! ఈ మనుజ లోకమునందు కలియుగమున ఐదువేల

సంవత్సరములు జరిగిన పిమ్మట ఎన్నెన్నియో వింతలు జరుగ నున్నవి. వాని నన్నింటిని కాలజ్ఞానముగా రచించితిని. సమయము చాలదు గనుక అందురేఖా మాత్రముగా రచించితిని. సమయము చాలదు గనుక అందురేఖా మాత్రముగా వినిపింతును.

భారత దేశమున్ పరులు పాలన సేయ నశించు భాగ్యముల్
భారము హెచ్చు నిద్ధరకు పాపముతోనిక జాతి జాతికిన్
వైరము గల్గు చోర భయ వంచితులయ్యెదరయ్య లెల్లరున్.

శ్రీశైలేశుని గుడిలో పొగమంటలు పుట్టును. స్వామివచ్చి మనుష్యులతో మాట్లాడి పోవును. వీర వసంతరాయలు పుట్టును. అంప వర్షము కురియును. ఆకాశములో నాలుగు చుక్కలుద్భవించును. ఆకాశమునందు ధ్వని పుట్టును. అల్పవర్షము కురియును ఆ ధ్వని విని మనుజులు చనిపోవుదురు. భూదేవి భోభోయని అరచును. భువిపై దుష్టులంతరింతురు. శ్రీశైల పర్వతముపైకి ముసలి వచ్చును. అచ్చట ఎనిమిది దినములుండి భ్రమరాంబదేవాలయమున మేకవలె అరచును. శిఖరముపైనుండి నిప్పులు రాలును. తేజమే తేజమే యనెడి వాక్యములు పుట్టును. బసవేశ్వరుడు ధణాం ధణాంయని రంకె వేయును. కాలుదువ్వును. మహాదేవుని కన్నులలో నిప్పులు రాలును. తిరుపతి గుడిలో మ్లేచ్ఛులు ఆడి పాడెదరు. అమావాస్య యందు చంద్రోదయమగును నెత్తురు వాన కురియును. ఆకాశము ఎర్రనగును. నింగిలో భుగుభుగులు శబ్దములు పుట్టును. మహానంది యందు పదునైదు దినములు ప్రకాశించెదను. వేదకాలము మరల వచ్చును. సాధుజనులను రక్షింతును. దుష్టులను శిక్షింతును. నా రాజ్యము వచ్చును. సాధుజనులను రక్షింతును. దుష్టులను శిక్షింతును. నా రాజ్యము వచ్చును. దేవ దేవోరంగపంచ శక్తులతో భూమండలం కరిష్యే.

(పీర్ సాహెబ్ ప్రవేశం)

పీర్ : మహరాజ్!మహరాజ్! రచ్చించండి గురుమహారాజ్! రచ్చించండి. మాది బిడ్డకీ రచ్చించండి.

వీర : నాయనా ఎవరు నీవు నీకు వచ్చిన కష్టమేమి ?

పీర్ : మహరాజ్ ఇడుగో ఈడే నా బిడ్డ సిద్దయ్య మీ మతంలోకి సేరి కాఫిర్ పన్లు సేస్తావుండాడు. ఈడి తల్లి ఇంటికాడ ఏడుస్తావుండాది.

వీర : నాయనా సిద్దయ్యా! తల్లిదండ్రులను వేదించుట న్యాయమా ?

సిద్ధా : గురుదేవా నేను తల్లిదండ్రులను వేధించుటలేదు నిజమైన తల్లిదండ్రులను శోధించుచుంటిని.

పీర్ : ఒరే సిద్ధా !!! నామాట ఇనరా బేటా, ఇంటికాడమీ అమ్మబేటా ! బేటా! బేటా! అని ఏడుస్తావుండాది. ఇంటికి పోదాం రారా బిడ్డా.

సిద్ధా : మాతా నాస్తి పితా నాస్తి
నాస్తి బంధు సహోదరా

అర్థం నాస్తి గృహం నాస్తి
తస్మాత్ జాగ్రత్త జాగ్రత్తః
తండ్రీ, ఈ ఆశ్రమమును వదలి పెట్టిరాలేను. వీరగురుని పాదములను విడిచి నేను బ్రతుకలేను. నన్ను క్షమింపుడు నేను రాలేను.

పీర్ : సూడండీ గురు మహరాజ్! మా సిద్దడికీ దయ్యం పట్టింది. ఎట్టా మహరాజ్ బొట్టు గిట్టు పెట్టినాడు. సన్నాసి గుడ్డలు కట్టినాడు. ఏంటో మంత్రాలు సదువుతుండాడు. వద్దని సెప్పండి సామీ! మాది బిడ్డకీ బాగుసెయ్యండి సామీ! మామతం వదలి పెట్టినాడు మహరాజ్.

వీర : నాయనా! పీరుసాహెబూ! ఆవేశ పడవలదు. ప్రశాంతముగా కూర్చొని నా మాటలను వినుము. నీకుమారునీ కేమియును భయమువలదు. కూర్చొనుము నాయనా!

పీర్ : (తనలో) ఈన ముకం సూత్తే నాకీ కూడ కాత్త ఇక్కడా కూకోవాలనీ అనిపిస్తావుండాది. (ప్రకాశంగా) సెప్పండీ మహరాజ్! (కూర్చుంటాడు)

వీర : నాయనా! ఈ మతములు కులములు అన్నియును మనము కల్పించుకొన్నవే. మతుల ననుసరించియే మతములు కలుగుచున్నవి. బిడ్డా! పీర్ సాహెబ్. మీ మతము మా మతము అన్నియును ఒక్కటే. మా మతను శాంతిని బోధించుచున్నది. మీ మతమును దానినే చెప్పుచున్నది. రామ్ రహీము శబ్దముల అంతరంగమొక్కటే. మతముల సారాంశమంతయు నొక్కటే "నదీనాం సాగరో గతిః" అన్నట్లు నదులన్నింటికి సముద్రము గతి యగునట్లు చివరకు మతము లన్నియు భగవంతునిలో లీనమగును.
ఆకాశాత్ పతితం తోయం యధాగచ్ఛతి సాగరమ్
సర్వదేవ నమస్కారం కేశవం ప్రతిగచ్ఛతి.

పీర్ : మహరాజ్! ఎంత సక్కని మాటలు సెప్పినారు. నాకే మీ మాటలు ఇంత ఇష్టంగా ఉండయ్. ఇంగ మీదీ వాళ్లకీ ఎంత మజాగా వుంటాయో, అయ్యల్లారా! నా బిడ్డకీ ఇంతా మంచి గురువు దొరికినాడు. నా బిడ్డ సేసుకున్న పున్నెం యిది. నాదీ బిడ్డకీ మీ సేతుల్లో పెడుతున్నా. మీరే రచ్చించండి.

వీర : అదృష్టవంతుడవు పీరు సాహెబూ!సిద్ధుని వంటి బుద్ధిమంతుని గన్న నీవు ధన్యుడవు.

అన్నా : స్వామీ! మీరు రచించిన కాలజ్ఞానమును గేయముల రూపములో సైతము రచించుచుంటిని వినిపించెదను శ్రద్ధగా ఆలకింపుడు.

వినరండయాగీత
వినరండయా
బ్రహ్మన్న నవగీత
విన రండయా

కలి యుగమ్మున కల్కి పురుష మాయల వలన
ధర్మ దేవత తల్లడిల్లేనయా:

ఈ మనుజ లోకాన పుణ్య తీర్థాలందు
పుణ్య పురుషుల వల్ల నిలిచేనయా
సత్యమే నిత్యమను సత్యమును మరచేరు
పక్షపాతపు గొడుగులెత్తేరయా
స్వార్థపరులైక్కువై జగమంత చిక్కులై
అజ్ఞాను లవతార మెత్తేరయా
వేద ధర్మపు వెలుగు వెలవెలబోయేను
ఆచార మడుగంటి పోయేనయా
పంచపాతకములు మించి పోయేనయా
శ్రుతుల గతులే తప్పిపోయేనయా
గ్రహగతులు తప్పు నా గ్రహమతులు కలిగేరు
క్రొత్త గ్రహముల చెలిమి కలిగేనయా
కులము కులముకు మధ్య కలహాలు పెరిగేను
ఇలకు జననష్టము కలిగేనయా
నదుల విధములు మారు నిధుల పథములు మారు
శివకేశవుల నింద జరిగేనయా
హేతువాదముబట్టి పాతకమ్ములుపుట్టి
నాస్తికత్వము పెచ్చు పెరిగేనయా
నేవచ్చు నందాక ఇట్టి వింతలు జరుగు
నా భక్తులకు నాశమే లేదయా
కాలజ్ఞానము విన్న కలుషమ్ములో నున్న కలిగమ్మున కలిమి కలిగేనయా.
శ్రీ గురుభ్యోన్నమః ఓం శాంతిశ్శాంతి శ్శాంతిః

(భక్తులందరు నమస్కరిస్తుండగా తెర వాలుతుంది
ఇది 'సాహిత్య సరస్వతి' కన్నెకంటి రాజమల్లాచారి విరచితమైన
'సంభవామి యుగే యుగే' అనే నాటకంలో ద్వితీయాంకం.

## తృతీయాంకం

(కక్కయ్య ఇల్లు తప్పెట కొట్టుకుంటూ చిందులేస్తూ పాటపాడు తుంటాడు.
నులకమంచంవేసి ఉంటుంది)

**తత్వం**

నందామయా గురుడ నందామయా
బెమ్మన్న సెప్పింది ఇందామయా
చిందేసి అందరము ఉందామయా
ఉందామయా కలిసి తిందామయా ॥నం॥
సాములు సెప్పింది సాచ్చిగ జరిగింది
కాలగ్నేనం వుంది కలిలో ఏదం మంది
కక్కయ్య సెప్పింది ఇనుకోండి పదిమంది
సిక్కేమి లేదయ్య సక్కనీ మాటయ్య ॥నం॥
కాసీకి పాయినోళ్లు కట్టాలు పడతారు
ఆడ సచ్చిన ఒకటే ఈడ సచ్చిన ఒకటే
మనసుకాసికి పోద్ది కట్టె కాటికి పోద్ది
ఏమన్న సెప్పింది యావన్న తప్పింద ॥నం॥
మతులే ఏరూగాని మతమంత ఒకిటేను
మతి లేనోడికి మతంమతివుంటే మతమేంది
సతమతం లేకుండ సరిగ ఉందే మతం
మతులు సరిగే ఉంటే మంచిదేనుర మతం ॥నం॥
ఇనరయ్య ఇనరయ్య ఇవరంగ సెబుతాను
ఉండోల్లు లేనోళ్లు కలిసి పోతారయ్య
నాజాతి నీజాతి ఒక జాతి అవుతుంది
కలిలోన బెమ్మయ్య కలలు పండేనయ్య ॥నం॥

(ముత్తి ప్రవేశిస్తుంది)

ముత్తి : ఏంది మావా ! ఇయాల బలే జోరుగుండవు పదాలు పాడుతుండవే.

కక్క : అదిగాదే ముత్తే, బెమ్మంగారు కాలగ్నేనం రాసిన్రుగా అట్టనే నేనుగూడ పదంకట్టి పాడుకుంటుండ.

ముత్తి : మావా ! బెమ్మంగోరు బెమ్మంగోరు అంట ఒకటే సొద. యాంది బెమ్మం గోరు దేవుడా యేంది ?

కక్క : దేవుడాని సిన్నంగంటావేందే, ఆసలికి ఆయనే దేముడు దైబం అన్నీ ఆయనే, ఇంకెవుడూ దేవుడు లేడూ గీముడు లేడు.

ముత్తి : అట్లయితే ఆయిన్ని కర్నంగోరు పిచ్చోరయ్యఅంటడు గద మావా(...

కక్క : అన్నోడికి పిచ్చి, నీకుపిచ్చి, అసమంటి మాటలన్నవా ? కటక్కున కల్లు మూసకపోతయ్, సెంపలేసుకో జాగర్త!

ముత్తి : అట్టా నా మావా! నాకు తెలవకన్న సెంపలేసుకుంట. (చెంప లేసుకొని) మావా నిజంగా ఆయన దేవుడేనంటావా ?

కక్క : శా! మల్లా అదేకూత, బెమ్మంగోరు నిజంగా దేముడే. మొన్న జాతర్నాడు ఏంది జరిగిందో తెలసా! కర్నంగోరు మునసబుగోరుదున్నని నరకటానికి సెలవిచ్చిన్రు. నేకొక్కపాలి గొడ్డలెత్తిన, అంతే బెమ్మంగోరాడికొచ్చి కక్కా! నరకొద్దురా నాయినా అన్నడు. అదేంది సామి నే నకరాల్సిందేనన్న. బెమ్మంగారు వద్దంటాడు. మునసబుగోరు నరకమంటాడు. అల్ల మద్దెన ఇరుక్కొని సచ్చినాననుకో. సివరికి మునుసుబు మాటిని గొడ్డలెత్తి దున్న మోడమీదేసినా ఇకేముంది నా రెండు కల్లు మూసకపోయినయి. నేను మల్లా కల్లు తెరిసేసరికి నా సేతుల్లో గొడ్డలి లేదు. దున్నమెల్లో పూల్దండుంది.

ముత్తి : అయితే బెమ్మంగోరు నిజంగా దేముడే. సరెకాని మావా! నువ్వు రోజా బెమ్మంగోరికాడికి బోతావుగద, ఒక సిన్న వరం కోరుకోగూడదాంట ?

కక్క : ఏందది ?

ముత్తి : మనం పేదోల్లంగద! ఈ గుడిశలోపడి సస్తన్నంగద. మనకి సాలినంత డబ్బియ్యమని అడుగుమావా.

కక్క : ఓసెర్రి మొగమా, డబ్బులేంటికే, ఇయ్యాలుంటయ్, రేపు పోతయ్, ఆయన గోరు సెప్పె మాటలే ముత్తేల మూటలు, మొన్న పోలేరమ్మ జాతర్నాడు ఏవయిందో తెలసా ?

ముత్తి : తెలవదు మావా ఏవయింది ?

కక్క : సంబరం సెయ్యటానికి ఊల్లో సందా వసూలికి మునుసుబు కర్నొలెంట నేనుగూడా పోయిన. సందా అడిగేకాడ మాటమీన మాటొచ్చి బెమ్మంగోర్ని పిచ్చిరయ్య నోరు మూసుకో అన్నాడు. అట్టగంటే నా కొల్లు మండింది. మునసబుమీన నేను గూడ నోరు జేసుకున్న ఆయననా మీన కోపమొచ్చి కిందికి తోసిండు. కిందపడ్డ. నన్ను బెమ్మంగోరు పైకి ఎత్తిండు.

ముత్తి : ఏంది మావా ! బెమ్మంగోరు నిన్ను అంటుకున్నడా ? ఆయన మైలపల్లా ?

కక్క : పక్కనే వున్న కర్నం నీయాల్నే అన్నాడు. సీ!సీ! అణ్ణి అంటుకున్నవ్. నువ్వేం సామివయ్యాని ? అప్పుడు బెమ్మంగోరు యావన్నడంటే, మనిసిని మనిసంటుంకుంటే మైలేడుందయ్యా అందరి పంట్ల నెత్తరే పారతది. అందరి శరీరాల్లో ఎనికలే ఉండయ్. మనుసులంతా ఒకటే నన్నడే.

ముత్తి : నిజంగా సాములోరి మాటలు ముత్తేలే, మావా ! ఆపైనేంది జరిగింది మావా.

కక్క : ఏవుంది!బెమ్మంగోర్ని సందా ఇత్తవా ఇయ్యావా అని అడిగిన్రు. మునసబు సుట్ట జుట్టుకుంట బెమ్మంగోర్ని నిప్పు తీసకరా! అన్నడు. ఇంకేవుంది పక్కనేవున్న అమ్మోరిగుడిలో నుంచి వైరాల మూకుడు గాలిలో ఎగిరొచ్చి మునుసుబు ముందు వాలింది.

ముత్తి : అట్టయితే ఈ సిత్రం నువ్వు కల్లారా సూసినవన్నమాట. నువ్వు అదురుట్టమంతుడవి మావా! నేనాడుంటే నేనుగూడ అమ్మోర్ని సూసేదాన్ని గద మావా.

కక్క : దేవుల్లని సూడటానికి ఏడకో ఎందుకు ? మన శరీకంలో గూడ సూడొచ్చంటనే. బెమ్మంగోరు సెబుతుంటే ఇన్న!

ముత్తి : ఏందిమావా బలే సిత్రంగుందే. మన వంట్లనే దేముళ్లున్న రన్న మాట.

కక్క : ఔ! మనవంట్లో అన్నీ శక్కరాలుంటాయంట, అందుట్లో, కింద శక్కరంలో ఇనాయకుడుంటడంట, రెండో శక్కరంలో బెమ్మదేవుడున్నడంట, బొడ్డు కాడ ఒక శక్కరం ఉండదంట దాంట్లో యిష్టుమూర్తి ఉంటడంట. రెండో సెక్కరంలో బెమ్మదేవుడున్నడంట. గుండెల కాడుండే సెక్కరంలో ఈస్పరుడుంటడంట. గొంతు కాడొక సెక్కరం వుంటదంట. దాంట్లో జీవాత్మ ఉంటడంట, కనుబొమ్మలకాడ పరమాత్మ ఉంటడంట. తలకాయ పుచ్చెలో ఎవురో ఉండడంట నాకు సరిగా మతికి లేదు.

ముత్తి : అట్టయితే వోర్నన్న కోసి సూద్దాం మావా.

కక్క : ముంగల నేను కోసి సూసినాక నీక్కాడ కోసి సూపిత్త లేవే!

ముత్తి : అది సరె గాని మావా.... మాటల సందట్లో మరిసిపోయిన మునుసబు గోరిమనిసొచ్చి నిన్ను రమ్మనిపోయిండు.

కక్క : ఎందుకంట ?

ముత్తి : ఆయనిగోరి సెప్పులు గుట్టాలంట. ఆర్దీసుకోటానికి.

కక్క : సెప్పులు గుట్టటానికి ఆర్దీసుకోటానికి పోవాల్నా. ఆ పప్పులింకుడకవు. ఆడి కొంపకు సచ్చినా పోను.

ముత్తి : ఏంది మావా ఆడుగీడంటవ్. పెద్దాయిన్ని పట్టుకొని.

కక్క : అదంతేలేయే. నీకు తెలవదు లే. పిచ్చి మొగమ. ఆడు మాత్రం నన్ను ఏరా! ఒరే ! కక్కా! కుక్కా అనటంలే.

ముత్తి : మరింకెట్ట పిలవాల మావ

కక్క : ఎట్ట పిలవాలంటవా ! బెమ్మంగోరు పిలసినట్టు నాయినా! బాబూ! కక్కయ్యా అనిపిలవాలి. మొన్న వల్లుమండి అట్టపిలవొద్దని సెప్పిన. ఈ తూరి అట్లపిలిత్తే నేనుగూడ అరె అంటనని సెప్పిన.

ముత్తి : నన్ను గూడ కర్నంగోరి పెల్లం అసే! ఒసే - అని పిలుత్తది గద మావా

కక్క : ఈతూరి పిలిత్తే వప్పుకొమాక! అట్ట పిలవటానికి ఈల్లేదని సెప్పు. మల్ల అట్టనే పిలుత్తనని సెప్పు. వాల్లకి రోగం కుదురుద్ది.

ముత్తి : ఆల్లు మనకంటె ఎక్కువోల్లు గద మావా

కక్క : ఎవుల్లే ఎక్కువోల్లు! తక్కువోల్లు ? అంతా ఒకటేనని బెమ్మంగారు సెప్పిన్రు.

ముత్తి : అట్టయితే ఈ పాలి నన్నట్ల పిలిత్తే నేనుగూడ ఒప్పుగోను మావా.

*(అన్నా జయ్యా ప్రవేశం)*

అన్నా : నాయనా ! కక్కయ్యా !

కక్క : ఎవురు సామీ! అన్నాజయ్యగోరా ! సామీ ఈ పేదోడి కొంపకు దయసేసిన్రా?

అన్నా : స్వామివారి తీర్థ ప్రసాదములు తీసికొనకుండా వచ్చితివి.

(ప్రసాదాన్ని ముత్తికి కక్కయ్యకు ఇస్తాడు)

ముత్తి : మావా! సాములోర్ని నిలబెట్టి మాట్టాడుతున్నవ్, కుకోమను.

కక్క : సామీ తమరుబ్యామ్మలు ఈ పేదోడి కొంపలో ఎట్ట కూకుంటరు సామీ.

అన్నా : కక్కయ్యా !

జన్మనా జాయతే శూద్రః

కర్మణా జాయతే ద్విజః

వేదపారేణ విప్రస్యాత్

బ్రహ్మజ్ఞానంతు బ్రాహ్మణః

ఎవ్వరైనను జన్మవలన శూద్రులే. ఉపనయనాది సంస్కారములతో బ్రాహ్మణులగు చున్నారు. బ్రహ్మజ్ఞానము కలవాడే బ్రాహ్మడు. అట్టి సంస్కారము నీకు పుట్టుకతోడ వచ్చినది. కనుక నీవు కూడా బ్రాహ్మణుడవేనయ్యా ! నీ కెట్టి సందేహమును వలదు. నేనీ నులక మంచముపై కూర్చుందును. (ముత్తి కక్కయ్య క్రింద చెరొక వైపున కూర్చుంటారు)

ముత్తి : సామీ ! తమరిని ఒక యిసయం అడగాలనుకుంటుండ. అడగ మంటారా!

అన్నా : అడుగమ్మా! ఏమినీ సందేహము?

ముత్తి : సామీ! మీ వోళ్లుబెమ్మంగోర్ని సెక్కలు సెక్కే పిచ్చీరయ్య అని అంటారు గద! మరి తవురెట్ట బెమ్మంగోరి కాడికి సేరిన్రు సామీ!

కక్క : అదే సామీ ! నామనుసులో ఇసయంకూడ.

అన్నా : శ్రీమద్విరాట్ పోతులూరి వీరబ్రహ్మేంద్రస్వాములవారు సాక్షాత్ శ్రీవిష్ణ్వంశసంభూతులు. వారికి కులములెక్కడనున్నవి. మావారెల్లరును ఆయనను దూషించుటలేదు. అట్లు దూషించువారు అజ్ఞానులు.

కక్క : సామీ ! పుష్పగిరోళ్లు సాములోర్ని తిట్టిన్రంటగద !

అన్నా : అందులకే తగిన ఫలితమననుభవించిరి. అచ్చటికి వెళ్లినపుడు వెంటనేనుగూడ నుంటిని. అచ్చటివారు స్వామిని పలుదూషణలు పలికిరి. స్వామివారి కన్నువారి గృహములపై బడినది. వారిండ్లన్నియు తగులబడి పోయినవి. తరువాత వారు స్వామువారి మహిమను గుర్తించి వారికి భక్తులైరి. వారే స్వాములవారిని పువ్వుల పల్లకిపై నూరేగించి ధన్యులైరి. అమ్మాయీ! దాహమగు చున్నది కొంచెం మంచినీరు తీసికొని రమ్ము.

ముత్తి : సామీ ! మాదిగోల్ల నీల్లెట్ల మీరు తాగుగారు ?

అన్నా : అదిగో నేను చెప్పిన మాటలన్నియునువిని మరల మొదటికే వచ్చితివి.

మాలనేయు మడత మాదిగకుట్టెడి

చెప్పు తోడుగవచ్చు చెన్ను మీర
వారి నంటరాని వారన నెందుకు
కాళికాంబ! హంసకాళికాంబ!
అని స్వాములవారు చెప్పిరి. మనమంతా దేవుని బిడ్డలమే తీసికొనిరాతల్లీ!

ముత్తి : (పాత్రతో నీళ్ల తెచ్చి యిస్తుంది)

అన్నా : నాయనా! ఈ నీళ్లకు మైల ఎక్కడున్నది. మీరు స్పృశించినంత మాత్రమున అంటుబడుచున్నవా? ఈ నీళ్ల మీరంటక ముందు కప్పలు చేపలు తాగి ఉమ్మివేసినవేగదా !
కప్ప తాగి యుమియు చేపతాగి యుమియు
నూతిలోని ప్రాణులన్నియుమియు
ఉదకమెల్ల జూడ నుచ్ఛిష్టమే గదా !
కాళికాంబ హంస కాళికాంబ.

కక్క : నిజమే సామీ ! బలే సెప్పిగ్రను.

అన్నా : (నీళ్ల తాగి) కక్కయ్యా ! ఇక నేను వెళ్లివచ్చెదను.

ముత్తి, కక్క : దండాలు సామీ దండాలు.

(అన్నా జయ్య నిష్క్రమిస్తాడు)

(తెరలో - ఒరేయ్ కక్కా! ఒరేయ్ కక్కా!)

కక్కా : ఎవురే ! మల్లా వచ్చిగ్రను. నిద్దర బోనియ్యకుండ

(ముత్తి లోపలకు పోతుంది)

(మునసబు ప్రవేశం)

మున : ఏందిరా కక్కా ! ఇంటికాడికి రమ్మని సెప్పంపితే రాలేదు కల్లునెత్తి కెక్కినయా ! ఒల్లు బలిసిందా నాయాల

కక్క : మునసబుగోరు ! మాటలు కాత్త జవరంగ రానీయండి.

మున : ఏందిరా ? ఏంజేత్తవు ? తలగొట్టిమొలేత్తవా ? ఎదవంట యదవ !

కక్క : ఏందయ్యా మాటలు మిగుల్తుండవు నాతక్కువేంది ? నీ ఎక్కువేంది ? మంచిగుండి పన్జేయించుకుంటే మంచిది.

మును : నీకు పొగురెక్కిన కారణం ఆ పిచ్చీరయ్య గదూ! ఆడి పిచ్చి కూతలు నీకు బాగా వంట పట్టినయ్. అందుకే ఇట్ట మొచ్చినట్లు వాగుతుండవు.

కక్క : ఇదిగో బెమ్మంగోర్ని పల్లెత్తు మాటన్నా! ఒప్పుకొనేది లేదు తెలసా!

మును : అవుద్దిలేరా! ఆ బెమ్మం పని నీపని దూదేకుల సిద్దణ్ణి మతంలోకి మార్చుకున్నాడుగా ఆ యిసయం

నావాబుకాడికి పోయింది. మన కరణం పీరు సాయిబుని తీసుకుని పోయిండు ఫిర్యాదు చేపించడానికి

(అంటూ మునసబు నిష్క్రమిస్తాడు ముత్తి ప్రవేశిస్తుంది)

కక్క : పోవయ్యా ! ఎదవగోల ! ముత్తీ నాకు నిదరొత్తంది. పక్కెయ్యి పండుకుందాం !

ముత్తి : అట్టనే మావా (వేస్తుంది)

(మంచంమీద కక్కయ్య పండుకుంటాడు క్రింద గుడ్డవేసుకొని ముత్తి పండుకొంటుంది ........... కోడికూత వినిపిస్తుంది)

కక్క : ఏకుజామయ్యింది. ఉప్పుడు ముత్తిబాగా నిద్దట్లోకిపొయ్యింది. దీన్నిగోసి దేవుల్లని సూట్టానికి ఇదే మంచి అదును. తెల్లారేలోగ కోసి సూడాల. కోత్తంటే అరుత్తదేమో! అరవకుండ మచ్చు మందేత్త (లోపలికివెళ్లి మరలా చేతిలో పొట్లంతో గండ్రగొడ్డలితో ప్రవేశిస్తాడు. పొట్లంలోని మందును ముత్తి ముక్కు దగ్గర పెడతాడు. ముత్తీ ! ముత్తీ ! (కదలించి చూసి) ఆ ..... ఇంగబయ్యంలేదు కోసి సూత్త (కోసినట్లు నటించి) ఆ ...... ఈడ ఇనాయకసామి ఉండాల ఈడ బెమ్మదేవుడుండాల ఏదీ కనిపిత్తంలేదే ! ఇవతలికి గోసి సూత్త ఈడ ఇస్నుమూర్తి ఉండాల ఏడీ ! అగపడడేంది ? నా ముత్తి సచ్చింది. నా ముత్తి నాకింగలేదు. ఆ దొంగ సన్నాసోడి మాటలిని నా సేతులారా నా ముత్తిని సంపుకున్న (ఏడుస్తూ) ముత్తీ ! నాను కటికోణ్ణే. అన్నాయంగ నిన్ను సంపుకున్ననే. నా కొంప నేనే తగలేసుకున్న ! ముత్తే ఎంతపని సేసిన్నే. దీని కంతకీ ఆయనే ఆ దొంగ సన్నాసే కార్నం. ఇప్పుడే ఎల్లి ఆయనంతు గనుక్కుంట.

(నిష్క్రమిస్తాడు- తెర వాలుతుంది)

ఇది 'అభినవ జయదేవ' కన్నెకంటి రాజమల్లాచారి రచించిన

సంభవామి యుగే యుగే....' అనే నాటకంలో

తృతీయాంకం.

## చతుర్థాంకం

(బ్రహ్మంగారి ఆశ్రమం. బ్రహ్మంగారు సింహాసనంపై ఆసీనులై ఉంటారు.

గోవిందమ్మ పాటపాడుతూండగా తెర తొలుగుతుంది)

గోవిం : నిఖిలము నీవే నిర్మల తేజా !

ఘనయోగి రాజా ! ॥ నిఖి ॥

వీరపాపమాంబ దత్త

పుత్రుడవై వెలసిన వీర

బ్రహ్మయోగి స్వామివైన
వేద వేద్యుడ వీవే ॥ నిఖి ॥
బనగాన పల్లెలోన
భక్తురాలు అచ్చమాంబ
గోవులగాచినట్టి దేవదేవుడవీవే ॥ నిఖి ॥
కలిలో భవితవ్యమందు
కలుగబోవు వింతలు ముందు
చెప్పితివి చెవికి పసందు
కాలజ్ఞానమునందు ॥ నిఖి ॥

(హారతి వెలిగించి స్వామివారికి హారతిపట్టి నొసట తిలకం దిద్దుతుంది)

స్వామీ : చిరకాలం తమ పాదసేవచేస్తూ తమ పవిత్ర నామం జపిస్తూ బ్రతికే వరాన్ని ప్రసాదించి దీవించండి.

వీర : దీర్ఘసుమంగళీ భవ ! దేవీ ! నీ సేవలతో నీ పూజలతో నన్ను నిజముగా దేవదేవుని చేయుచుంటివి.

గోవిం : నేను చేయడం లేదు స్వామీ ! మీరే దైవంగా అవతరించారు.

అచ్చమ్మ గృహములో నాలగాచుట జూడ
కృష్ణమూర్తి వగుట కతన గాదె
ఒకచోట పుట్టుట ఒకచోట పెరుగుట
కృష్ణమూర్తి వగుట కతనగాదె
గోవిందమను నన్ను గూడి యుండుటజూడ
కృష్ణమూర్తి వగుట కతనగాదె
గోవ బాలకుడవు గోవిందుడవు నీవు
వేణుగాన లోల వేదవేద్య
వకుళమాలగన్న వనమాలి వీవయా
విశ్వమెల్ల నీది వీరగురుడ !

వీర : దేవీ ! ఈ సామాన్య మానవుని మాధవునిగ వర్ణించితివి నిజమే ఎట్లనిన

దారు వృత్తులకు నాధారభూతుండనై
మనిషిని సేవించు మాధవుడను
బంగారు పనులెల్ల సింగారముగజేసి
మని, షిని సేవించు మాధవుడను
కంచర పనుల గావించుచు లోకాన

మనిషిని సేవించు మాధవుడను
కమ్మర వృత్తితో నిమ్ముగా నిమ్మహిన్
మనిషిని సేవించు మాధవుడను
శిలలపైన దైవ శిల్పమ్ములను జెక్కి
మనిషి సేవజేయు మాధవుడను
మంచి మనసుగలుగు మనిషి మాధవుడగున్
మనిషి నేను కాను మాధవుడను

(గోవిందయ్య ప్రవేశము)

గోవిం : తండ్రీ ! నమస్కారము

వీర : శుభ యోగమస్తు

గోవిం : శుభమస్తు

గోవిం : తండ్రీ ! నాదొక విన్నపము

వీర : మీ సిద్ధాంతములు లోక కంటకములుగా నున్నవి.

గోవిం : కుమారా ! తండ్రిగారు లోక కల్యాణం కోసం చెప్పిన సిద్ధాంతాలు లోక కంటకాలెలా అవుతాయి.

వీర : బిడ్డా ! నేను చెప్పిన ధర్మములు లోక కంటకములెట్లయినవి ?

గోవిం : మీరు చెప్పిన అస్పృశ్యతా సిద్ధాంతము అగ్రజాతులకు అవమానముగా నున్నది ?

వీర : గోవిందయ్యా ! ఎవరగ్రజాతి ?

అగ్రజాతి ఎవడు అధమ జాతి ఎవడు
పుట్టిగిట్టు విధము బట్టిచూడ
అంటరాని తనము అవమానమేగదా
కాళికాంబ హంసకాళికాంబ !

మానవ కులమంతయును ఒక్కటే. అంటరాని తనము పాటించుట మహా పాపము. అందరి శరీరములలో ప్రవహించునది రక్తమే.

గోవిం : నాయనగారూ ! జాతర సందర్భములలో జంతు బలిని నిషేధించితిరి. లోకమున హింస జరుగకుండ నున్నదా ! పూర్వము మహా ఋషులే యజ్ఞములయందు బలి పశువులనుపయోగించిరి.

వీర : నాయనా ! ప్రాణులన్నియును సమానములు. అట్లయినచో నోరులేని పశువులనే ఏల చంపుట ? మనిషిని బలియొసగ కూడదా ? అందుచేత జంతుబలిని ని షేధించుటలో తప్పులేదు.

గోవిందమ్మ : స్వామీ ! నేనుకూడ ఈవిషయం విన్నాను. కరణం మునసబులు మీపైపగవహించారట.

వీర : వినాశకాలే విరీత బుద్ధి:

గోవిం : తండ్రీ, ముఖ్యముగా సిద్దని మీరు ఆశ్రమమున చేర్చుకొనుట వారి పగకు కారణమైనది.

వీర : వారి పగ మననేమి చేయగలదు.

గోవిం : స్వామీ ! మీ సిద్ధాంతాలు మంచివే ! కానీ గ్రామంలో వాళ్లకు నచ్చనప్పుడు వాళ్లకు బోధించడం దేనికి ?

వీర : దేవీ ! నచ్చినవారుందురు, నచ్చనివారుందురు, మంచియనుకున్న దానిని ప్రబోధించుటయే నా కర్తవ్యము.

(సిద్దయ్య ప్రవేశము)

సిద్ధ : గురుదేవా ! ప్రణామములు
వీరబ్రహ్మ గురూత్తమా ! ఘనయతీ ! వేదాంత పాథోనిధీ !
కారుణ్యాంబుధి దేల్పుమా ! స్తుతమతీ కైవల్య నారాయణా
సారాచార విశారదా ! మునిపతీ స్వాంతంబునన్ గోల్తునా
ధారంబీ వనుచున్ సదా స్తుతమతీ ! ధర్మజ్ఞ లోకేశ్వరా !
గురుదేవా ! నన్నునుగ్రహించి కారణోపదేశముచేసి ముక్తి మార్గమును
చూపి తరింపజేయవలసినదిగా ప్రార్థించు చున్నాను.

వీర : నాయనా ! సిద్ధా! ఇటువచ్చి కూర్చొనుము.

(సిద్దుడు బ్రహ్మంగారి పాదాలవద్ద కూర్చుంటాడు)

వీర : సిద్ధయ్యా !
కారణ మిచ్చెద గైకొనుమామమ
కారముతో అనురాగముతో
కోరిన కోరిక తీరును వైళమ
కూరిమితో శివ యోగముతో

(పోతులూరయ్య ప్రవేశము)

పోతు : నాయనగారూ! ఆపండి సిద్దునకు గురుకారణ మిచ్చుటకు వీలులేదు.

సిద్ధ : గురుపుత్రా ! సోదరా ! ఎందులకు వలదను చుంటిరి.

పోతు : ఎందులకా ?
మ్లేచ్ఛజాతిని నమ్మము మేము నిన్ను
ఆశ్రమమ్మున చేర్చుట కలవిగాదు
నీవు పుట్టిన వంశము నీచమగుట
మారు మాటలు పల్కక మరలిపొమ్ము.

సిద్ధ : నేనా వంశమున జన్మించినంత మాత్రమున గురుపూజకు పనికి రానా ?

గురుదేవా! మీరే నన్ను కనికరింపవలెను.

వీర నారాయణా భవద్విమల పాద

పద్మముల సేవ విడిచినే బ్రతుకజాల

నన్ను గావుము ధర్మజ్ఞ సన్నుతింతు

ఆశ్రమము వీడి ఎచ్చటి కరుగగలను ?

వీరావతారా ! పాహిమాం పాహి.

పోతు : ఇవియన్నియు దొంగవినయములు. గోమాతను రక్షించు మా మార్గమున గోమాతను భక్షించు నీవెట్లు చేరుదువు! ఇట్లు చేరుటకేదో పన్నాగముండి తీరును. నీ మతము వేరు మా మతము వేరు. నీవు మా మతమున చేరుట కనర్హుడవు.

సిద్ధ : సోదరా ! గుణము ప్రధానముగాని కులము ప్రధానము గాదు. ఒకే పంకములో జన్మించి పద్మము, కప్ప వేరు వేరుగా ఆరాధింపబడుట లేదా !

పోతు : మాటలు నేర్చితివి. కన్నెలను చెరబట్టు కటికిజాతినీది. కరుణా నిలయమైన ఈ ఆలయములో నీకు స్థానము లేదు పొమ్ము.

గోవిం : తమ్ముడా ! పోతులూరయ్యా ! ఎందుల కనవసరముగా సిద్దుని బాధించెదవు ! సిద్దుని ఆశ్రమములో చేర్చుకొనిన తండ్రి గారికీ విషయము తెలియదందువా ? వారిని మాట్లాడనిమ్ము.

పోతు : అన్నా ! నీకు తెలియదు. నీ వూరకొనుము. వీని జాతిని విశ్వసింపరాదు. ఇతనికి ఆశ్రమమున స్థానమీయరాదు.

వీర : కుమారా ! పోతులూరయ్యా!

పుట్టెరాక్షస కులమునకు వెలుగిడవి

భీషణుండు గుణవి భూషణుండు

పాల కడలియందు పచ్చి విసము బుట్టె

గుణము చూడవలము కులముగాదు.

కనుక గుణమునెంచవలయునుగారిని కులమునెంచరాదు.

గోవిందమ్మ : నాయనా ! సిద్దా! ఇంటికడ తల్లి నీ కోసం విలపిస్తున్నది. మాతృ హృదయం తెలిసినదాన్ని కాబట్టి చెబుతున్నాను. ఇంటికి వెళ్లి సంసార ధర్మాలను నిర్వర్తించు.

సిద్ధ : అమ్మా ! లోకమాతా ! గోవిందమ్మా ! నీ దయకూడ నాపై తప్పెనా తల్లీ! నేనేమి పాపము చేసితినమ్మా !

తల్లి లేదమ్మ! లేడమ్మ తండ్రి గూడ

లేదు గృహమును అర్థమ్ము లేదు లేదు

అన్నదమ్ములు చెల్లెండ్రు నసలులేరు

ఉన్నదొక్కటె గురుపాదమన్న ధనము.

తల్లి : వీర గురుని పాదములు విడిచి నేను వెళ్లలేను. క్షమింపుము.

వీర : సిద్ధా ! ఇప్పుడు నీ తండ్రి పీర్‌సాహెబ్ ఈ ఊరి కరణముగారి ప్రేరణతో నవాబుకడ అభియోగము మోపుచున్నాడు. అందులకే ఈ ఆటంకము.

పోతు : తండ్రీ ! ఏమందురు ? ఇతనిని ఆశ్రమమున నిలుపు కొనుటయేనా మీ నిశ్చయము ?

వీర : నాయనా ! పోతులూరయ్యా! నాపై నీకు గౌరవము కలదా?

పోతు : గౌరవమున్నది తండ్రీ !

వీర : ఎటువంటి గౌరవము ?

పోతు : నాకు పితృదేవులని విశ్వమునకే జనకులని.

వీర : అయినచో నామాటలను ఆలకించెదవా ?

పోతు : ఆజ్ఞాపింపుడు

వీర : సిద్దయ్య కులముచేత దూదేకుల వాడైనను గుణముచేత బ్రాహ్మణుడు. ఇతడు కారణజన్ముడు. శివాంశ సంభూతుడు. పూర్వ జన్మమున కాశీరాజ్యపు యువరాజు. ఆనందవర్మ గోహత్యాదోషమువలన గోభక్షకులయింట జన్మించినాడు. ఆపాపపరిహారము కొరకే మన ఆశ్రమమునకు వచ్చినాడు. ఇది దైవ ప్రేరణ. ఇతనికి తప్పకకారణ మొసంగవలెను.

(రక్తపు కత్తితో కక్కడు ప్రవేశం)

కక్క : ఏయ్! దొంగసామీ! నీ పానాలు నిలువునా తీత్త. ఈ గొడ్డటితో నిన్ను నరికి పాతేత్త. ఇట్టా ఎంతమంది పానాలు తీద్దామనుకున్నవ్.

పోతు : ఒరేయ్ ! ఏమి నీ పొగరు ?
అంటగూడని నిన్నంటి నందువలన
తండ్రికీనాడు కలిగెను తగిన ఫలము
కారు కూతలు కూసిన కతననీదు
నాలుకను చేసెదనువేయి చీలికలుగ

గోవిం : తమ్ముడా! పోతులూరయ్యా! శాంతించుము. అసలు విషయము తెల్సుకొందము. తండ్రిగారిని మాటాడనిమ్ము.

వీర : నాయనా కక్కయ్యా! నా వలన ఏమి దోషము జరిగినది ?

కక్క : ఏంది జరిగిందేదయ్యా! నా పెల్లాన్ని నిలువునా సంపినవు.

వీర : నేను నీ భార్యను చంపితినా ?

కక్క : నువ్వు సంపలేదు. నేనే సంపుకున్న నీ మాట్లిని.

వీర : నా మాటలు విని చంపితివా ?

కక్క : ఔ! నీ మాట్లినే సంపిన, మడుసుల ఒంట్లనె దేవుల్లుంటరని సెపితివి గంద.రేతిరి నా పెల్లాన్ని కోసి సూసిన దేవుల్లు లేరు గీవుల్లు లేరు. నీ మోసపు మాట్లిని అన్నాయంగ నా ముత్తిని సంపుకున్న.

వీర : అయ్యయ్యో! కక్కయ్యా! ఎంతపని చేసితివి ? నేను చెప్పిన విషయమును సరిగ అర్థముచేసికొనలేక పోయితివి. కారణ దేహము ధరించి తపోనిష్ఠలో నుండి సర్వేశ్వరుని ధ్యానించిన దేహములోని ఆయా స్థానములలో భగవంతుని దర్శింప వచ్చునని చెప్పితిని.

కక్క : ఈ డొంకతిరుగుడంత నాకు తెలవదు. ముందు నా పెల్లాన్ని బతికిత్తవా! లేకపోతే నిన్ను నరకమంటావా?

వీర : కక్కయ్యా! నీ భార్య మరణించలేదు. నిన్ను వెదకి కొనుచు ఈ ఆశ్రమము కడకువచ్చి బయట నిలువబడినది. ముత్తీ! లోపలకు రామ్మా!

ముత్తి : (లోపలకువచ్చి) దండాలుసామి ! మా మావకోసమొచ్చిన సామీ!

కక్క : ఎందే ముత్తే! నువ్వు బతికే వుండవా?

ముత్తి : అదేంది మావా అట్టంటవు. అయితే నేను సచ్చిన్నా?

కక్క : అవునే! నేనే నిన్ను కోసి సంపిన బెమ్మంగోరు మంతరం ఏసి మల్లా నిన్ను బతికించిండు. సామీ! నువ్వు నిజంగా దెవుడివే. (సాగిలబడి మ్రొక్కుతాడు)

వీర : నాయనా! కక్కయ్యా! లెమ్మా! నీ అభీష్టసిద్ధి కలుగుచున్నది. బిడ్డలారా! మీయందరకు యోగ దృష్టి ప్రసాదించు చున్నాను. షట్చక్రములయందు ఆయా దేవతలను దర్శింపుడు ఇదిగో.

నాల్గు దళములు గలయట్టి నలిన మందు
కల్గు నాధార మనెడి చక్రమ్మ సుమ్మ
దీని కధిపతి గణపతి దేవుడగును
కనుల పండుగ కలుగగ కాంచుడయ్య

కక్క : అడుగో! అడుగో! వినాయకమయ్య కనపడుతుండడు. దండంపెట్టే ముత్తే.

ముత్తి : దండాలు సామీ దండాలు

వీర : రెండవది స్వాధిష్ఠానమను చక్రము

గోవిం : ఆహా! బ్రహ్మదేవుణ్ణి ప్రత్యక్షంగా చూస్తున్నాను.

ఆరం దళములు గలయట్టి యంబుజమున
కలదు స్వాధిష్ఠమనెడి చక్రమ్మ సుమ్మ
దాని కధినేత యగును విధాత యతని
కనుల పండుగ కలుగగ కాంచుడయ్య

వీర : మూడవది మణిపూరక చక్రము

గోవిం : అడుగో!

పది దళమ్ముల పద్మమ్ము పరుగువందు

కలదు మణిపూరక మను చక్రమ్ము సుమ్మ
దీని కధిపతి శ్రీపతి దివ్యమూర్తి
కనుల పండుగ కలుగగ కాంచుడయ్య

వీర : నాలుగవది అనాహత చక్రము

పోతు : అహా! ఏమి ఈ దివ్య ప్రకాశము
పదియు రెండు దళముల పద్మమందు
కలదనాహత మనెడి చక్రమ్ము సుమ్మ
దీని కధిపతి పశుపతి దివ్యమూర్తి
కనుల పండుగ కలుగగ కాంచుచుంటి

వీర : ఐదవది విశుద్ధ చక్రము

సిద్ధ : ఆహా! అద్భుతమైన కాంతి
పదియునారగు దళముల పద్మమందు
కలుగును విశుద్ధమనెడి చక్రమ్ము సుమ్మ
కంఠమందున జీవాత్మ కలడువాని
కనులపండుగ కలుగగా కాంచుఢయ్య!

వీర : ఇది ఆగ్నేయ చక్రము.
కలదు భ్రూమధ్యమందున కమలమొకటి
అందు నాగ్నేయ చక్రమ్ము నరయుడయ్య
రెండు దళములతో వెలుగుచుండు నందు
కలదు పరమాత్మ కనులార గాంచుడయ్య!
వేయి దళముల సహస్రారమిది
వేయి దళముల పద్మమ్ము వెలుగులిడుచు
బ్రహ్మరంధ్రమ్మునందున పరగుదాన
వినుడి యోంకార శబ్దమున్ వీనులార
కనుడినా విశ్వరూపమ్ము కన్నులార!

సిద్ధ : అహో! వీర దేశికా ! రక్షమాం ! రక్షమాం !
పశ్యామి దేవాంస్తవ దేవ దేహే
సర్వాంస్తథా భూత విశేష సఙ్ఘాన్.
బ్రహ్మాణ మీశం కమలాసనస్థ
మృషీంశ్చ సర్వానురాగంశ్చ దివ్యాన్.

ప్రభూ : అది మధ్యాంతరహితమైన నీతనువును ప్రకాశమును కాంచలేకున్నాను. నీ దివ్యదేహమును ఉపసంహరించు కొనుము.

వీర : మాతే వ్యథా మాచ విమూఢ భావో
దృష్ట్వారూపం ఘోర మీదృఙ్మమేదమ్
వ్యపేత భీః ప్రీమతమనాః పునస్త్వం
తదేవమే రూపమిదం ప్రపశ్య

గోవిందమ్మ: స్వామీ! దేవ దేవా?
అనామయుండవై వెలుంగునాది దేవ వందనమ్
పరేశ భాసమాన రూప బ్రహ్మతేజ వందనమ్
ధరా ధరేంద్ర నందినీశదర్పణా నమోస్తుతే
త్రిమూర్తి రూపధీర వీర దేశికా నమోస్తుతే

వీర : కక్కయ్యా! ఈ మానవ శరీరమునందు సర్వ దేవతలను కాంచితివి గదా!

కక్క : సూసిన సామి ! నిజంగ నువు దేవుడివని నమ్మిన దండాలు సామీ దండాలు.

వీర : అమ్మా ! ముత్తీ ! నీ కోరిక నెరవేరినదా ?

ముత్తి : నిజంగనువ్వు దేవుడివే సామీ ! మేం సల్లంగ బతికే వరమియ్యి సామి! మేం సల్లంగ బతికే వరమియ్యి సామి!

వీర : నాయనా ! రాబోవు కాలమున సంఘములో అంటరానితనము నిర్మూలింపబడును. మీ కులము వారికి సంఘములో గౌరవము కలుగును. పెద్ద పెద్ద పదవులు లభించును. మీ జాతి వారు హరిజనులను గౌరవనామమున పిలువబడుదురు.

**(భటుడు ప్రవేశిస్తాడు)**

భటు : గురుమహారాజ్ ! సలామలేకుం

వీర : శుభమస్తు

భటు : కడపా నవాబ్‌గారి దర్బార్‌మే మాదీ కొల్వు సేస్తుండాడ్. నవాబ్ మీకీ తాఖీద్ రాసి పంపిండు.

**(తాఖీదు ఇస్తాడు)**

వీర : నాయనా ! పోతులూరయ్యా ! ఈ లేఖను చదువుము.

పోతు : (లేఖనందుకొని) శ్రీశ్రీశ్రీ కందిమల్లయపల్లె మఠాధీశ్వరులైన శ్రీమద్ విరాట్‌పోతులూరి వీరబ్రహ్మేంద్ర స్వాములకు కడపనవాబు వ్రాయించి పంపిన తాఖీదు.
మీరు మా ముస్లిములను మీహిందూమతములోనికి చేర్చుకొనుచున్నట్లు ఫిర్యాదులు వచ్చి యున్నవి. ఇందుకు మీరు స్వయముగా వచ్చి సంజాయిషీ చెప్పుకొనవలెను. లేదా రాజదండనకర్హులు.

ఇట్లు
కడప నవాబు

వీర : నాయనా ! సిద్ధా! చూచితివా ? ఇటువంటి ఇక్కట్లు కలుగుననియే సోదరులు నిన్నాశ్రమమున చేర్పవలదని చెప్పిరి.

సిద్ధ : గురుదేవా! కడప నవాబు దర్బారుకు మీరు వెళ్లనవసరము లేదు. మీ పక్షమున నేను వెళ్లునట్లు దయతో అంగీకరించి అనుగ్రహింపుడు.

వీర : చిరంజీవి! వెళ్లిరా!సిద్ధా!

(తెర వాలుతుంది)

• ఇది 'మధురకవి' కన్నెకంటి రాజమల్లాచారి రచించిన

'సంభవామి యుగే యుగే' అనే నాటకంలో చతుర్థాంకం.

## పంచమాంకం

(కడప నవాబు దర్బారు, నవాబు సింహాసనాన్ని అలంకరించి ఉంటాడు. ప్రక్కన మంత్రి కూర్చొని వుంటాడు. ఒక వైపు సీర్ సాహెబ్, కరణం నిలువబడి ఉంటారు)

భటుడు : (ప్రవేశించి నమస్కరించి)

హుజూర్! తమరి దర్శనాన్కి సిద్ధయా వచ్చిండు. హాజర్ సెయ్యమంటారా సర్దార్!

నవా : అచ్చా! వాడికి లోపల్కి పంపు

(భటుడు సిద్ధయ్యను ప్రవేశపెడతాడు)

నవా : బచ్చా! తుమ్హారా నామ్ క్యా హై!

సిద్ధ : సిద్ధయ్య అందురు.

దివాన్ : హుజూర్ ఉర్దూలో సెప్తా వుండాడ్ నీకీ తెల్గులో సెప్తా వుండాడ్ హేమ్టి నీకీ ఉద్దేశం ?

నవా : ఔ! ఉర్దూ బాష మనది

సిద్ధ : జహాపనా!

ఉర్దు మనది యనుచు సర్దారు పలికెదు
తెలుగు భాష కూడ తెలియ మనదె
భాషయేదిమైన భావ మొక్కటి చాలు
ద్వేషమేల తెలుగు భాషయందు

దివా : అరే సిద్దా! పాగల్ మాటల్‌కే సాలించీ అడ్గిందాన్కీ జవాబ్ సెప్పు.

నవా : దివాన్‌జీ!మీకీ యిశారణా చెయ్యండి

దివా : చిత్తం హుజూర్! సిద్ధయ్యా! నీకీ తల్లీ తండ్రీ హెవురూ ?

సిద్ధ : మాతా నాస్తి పితా నాస్తి నాస్తి బంధు సహోదరా

నవా : హేందీ దివాన్‌జీ! కాఫిర్ బానలో సెపుతుండాడ్, మాకీ తెల్వటంలే.

దివా : హిద్గో!కర్నం! హేందీ సిద్దయ్యా సెప్పింది ?

కరణం : తనకు తల్లిదండ్రి ఎవ్వరూ లేరనుచున్నాడు జహాపనా!

పీర్ : హుజూర్! అంతా అబద్దం. సిద్దయ్యా నాదీ బిడ్డ. క్యారే సిద్దా! ఇట్టా సెపితే ఎట్టాగరా! ఇంటికాడ నీదీ అమ్మా ఏడుస్తా వుండాది.

దివా : తుమ్ చుప్‌రహో! సిద్దా ! నీదీ నేరాన్కి సిచ్చా ఏందో తెల్సా, మనసు మార్చుకొని సెమాపన ఏడ్కో.

సిద్ధ : నేను నేరము చేసితినా ? తెలిసి ఏ నేరమును చేయలేదు. లెలియకచేసి యుండవచ్చును.

దివా : తెల్సి సేసిందీ హొక్టే, తెల్వక సేసింది హొక్టే రెంట్కి సెమాపనా ఒకే తఫా ఏడ్కో.

సిద్ధ : రెండు నేరములు చేసితినా ఏమిటవి ?

దివా : హొక్టి పెంపంచంలో హన్ని మతాల్కి అన్నా ఎక్వా అయిన ముసలమాన్ మతాన్కి హొదిలీ పెట్టి కాఫీర్ మతంలోకి సేరటం.

సిద్ధ : జహాపనా! అన్ని మతముల సారాంశము ఒక్కటే.

మతము మతమటంచు సతమత మదియేల
సమ్మత మనునది మన్మతంబు
మంచి మనసు చాలు మతభేదమేల రా
మతము గతము మరచి మనుట మేలు

కర : ఈ మాటలన్నియు ఆ కంసాలి గురువుకడ నేర్చినవే జహాపనా!

నవా : సిద్దా! ఆ కంసాలి గుర్వూ అంత గొప్పవాడా!

సిద్ధా : మా గురుదేవులు కమసాలి కాదు.

కాడు కమసాలి యాతడు కర్మభుజుడు
కాడు కమసాలి శ్రీ విశ్వకర్మ యతడు
కాకు కమసాలి యాతడు ఖరజితుండు
కాడు కమసాలి మనపాలి ఖడ్గధరుడు
ఎల్ల మతములు ఆయనలో నిండియున్నవి.

దివా : హుజూర్! సూడండీ! హీడ్కి పొగర్ పనీపాటల్ లేకుండా తత్వాల్ గిత్వాల్ పాడుకుంటవుండే ఆ సన్నాసీ దేవుళ్లకే దేముడా ?

సిద్ధ : ఎంత పొరపాటు పడుచున్నారు. మహారాజైనను మహా పీఠాధిపతియైనను మహా భక్తుడైనను వళ్లువంచి పనిచేయవలయు నన్నది వారి సిద్ధాంతము. అందులకే తానవతరించిన విశ్వకర్మ వంశము వారి వృత్తుల నాశ్రయించి అందు శ్రేష్ఠమైన వడ్రంగముచేయుచు లోకోపకారము చేయుచున్నారు.

నవా : సూడూ! సిద్దా! నీకి మర్యాదగా సెప్తుండా! నువ్వు బచ్చావని వాకీ గుసా సెయ్యటంలేద్. నా మాట

ఇన్కో అపాడు మతాన్కి హొదిలేసి అల్లాకీ ఆశ్రయించు, మన నవాజులో హుండే ఆ ఖుషీ ఆ తత్వాల్లో హిమీ ఆండాది బేటా వాటన్నిటికీ వదిలీపెట్టు

సిద్ద : ప్రభూ!

అతని మాటలోనె ఖురాను నాలకింతు
అతని మాటలోనె నవాజు ననుభవింతు
అతని మాటలోని మతమ్ము ననుసరింతు
అతడె ఖురాను నునవాజు నన్యమేల ?

నవా : సిద్ధా ! నీదీ గుర్వూ హంత గొప్పవాడ్ హయితే నీకీ హేందీ నేర్పిండు ?

సిద్ద : మా గురుదేవులకు తెలియని విద్యయేమున్నది ? అన్ని విద్యలను నేర్పివాడు.

దివా : కానీ నీకీ ఇనయం ఇదే యతల్ నేర్పాలేదు.

సిద్ద : ఎందుకు నేర్పలేదు. మా గురువులకడ మేము నేర్చినది బుధజన విధేయత వినయములు మాత్రమే.

దివా : కన్పడతానే వుంది. నీ ఇనయం ఇదే యత దర్బార్లోకి రాంగానే హుజూర్కే సలాంచేసినావ్ ? ఇదేనా వీదీ బక్తీ యినయం ?

సిద్ద : ప్రభువుల మేలుగోరియే నేను వారికి నమస్కరింపలేదు.

సింహముఖునకు నర్పణ సేయునట్టి
నాదు నతులను చేకొను నతని శిరము
మొగము వేయి ఖండములుగ పగులునందు
కోరకు మత్కృత వలన వందనమ్ము

నవా : ఖామోష్! ఏమి సెప్పినావురా బద్మామ్! నీకీ సలాం మాకీ సంపుద్దా ? ఎంత పొగర్.

సిద్ద : అవును జహాపనా! కావలయునన్నచో పరీక్షింపుడు. ఒక నల్లరాలిని దెప్పింపుడు. దానికి నేను నమస్కరించెదను. అప్పుడు ఏ మగునో తెలిసికొందురు.

దివా : ఈడి కాడ మంత్రాలు మాయల్ ఉన్నాయంట హుజూర్!

నవా : అహ్హాహ్హాహ్హా ! సిద్దా! నువ్వు సాధుల్ సన్నాసుల్లోసేరి మాయల్ మంతరాల్ నేర్చీనావ్.... అం...... రాయీ తీస్కావస్తే ఏందీ అయిద్దీ ?

సిద్ద : నా నమస్కారం స్వీకరింపలేని నల్లబండ నాల్గు ముక్కలగును.

నవా : హయితే సిద్ధా!నీకీ మాయల్ సూడవాలెననీ కుషీగా వుంది. నల్లారాయితోపని హెంద్కూ బేటా నీకి తాల్లతో కట్టేపిస్తాం ఏది ఇడిపించుకో సూద్దాం.

దివా : అచ్చీ బాత్! బలే మాట సెప్పిన్రు. రాయీ లేద్ గీయీ లేద్. ఈడ్కి కాల్లూ సేతుల్ కట్టీపిద్దాం.

పీర్ : బేటా!సిద్ధా! నామాటిను హుజుర్కి సలాము సెయ్యి.

సిద్ధ : తండ్రీ! అంతా ఈశ్వరేచ్ఛ. అన్నిటికీ ఆ వీరబ్రహ్మముగారే ఉన్నారు.
కర : అన్నిటికి ఆ బ్రహ్మమే ఉన్నాడట జహాపనా! వెంటనే వీడి కాళ్లు చేతులు కట్టి వేయింపుడు.
నవా : ఎవరూ అక్డా ?

(ఇద్దరు భటులు ప్రవేశిస్తారు)

భటు : జీ! హుజూర్.
నవా : సిద్ధడ్కీ తాళ్లతో కట్టెయ్యండి.
భటు : చిత్తం హుజూర్ (నిష్క్రమిస్తారు)
పీర్ : బేటా! నా మాటినుకో. సలామ్ సెయ్యి.
సిద్ధ : తండ్రీ ఎట్లు జరుగవలసి యున్నదో అట్లు జరుగును. చింతయేల అన్నింటికీ సర్వేశ్వరుడున్నాడు.
పీర్ : హుజూర్!నాదీ బేటాకీ వదిలీ పెట్టండి హుజూర్, సెమించీ వదిలెయ్యండి.
నవా : తుమ్, చుప్ రహో నీది బేటాకీ బుద్ధి సెప్పి పంపిస్తాన్. ఏయ్ కర్నం.
కర : చిత్తం జహాపనా ?
నవా : పీర్ సాయిబ్‌కీ తీస్కోని నువ్వు ఎళ్లీపోవచ్చు.

(భటులు తాళ్లతో ప్రవేశిస్తారు)

సిద్ధ : గురుదేవా! నీవే రక్ష!
నవా : అహ్హహ్హహ్హ ఇప్పుడు ఈడ్కీ యీరబెమ్మం వచ్చీ కాపాడవాలె. సిద్ధా! ఏదీ నీ మహిమల్ సూపించు
సిద్ధ : ప్రభూ! వీరబ్రహ్మేంద్ర!

దోసము చేయలేదు పరదూషణ సేసి యెరుంగ నేరికిన్
మోనము సల్పలేదు చెడు మోహముతో చరియింపనైతినీ
వాసము చేరుకొంటిని నవాబిది నేరముగా తలంచెనీ
కోనము వేచియుంటినను కూరిమిగావుము వీరదేశికా!

నవా : ఇప్పట్కీ అయినా మాకీ సలాం సెయ్యి. నీకీ ఇడిసీ పెడతామ్.
సిద్ధ : ఇప్పటికైనను మించిపోయినది లేదు. మా గురుదేవుల పాదముల నాశ్రయింపుడు. రక్షణ పొందుదురు.
నవా : అయితే!ఏడీ! నీదీ గుర్వూ బెమ్మం ఎక్డా ఉన్నాడో పిల్వూ!
సిద్ధ : జహపనా ! నా గురువు సర్వాంతర్యామి ఎందెందు వెదకి చూచిన అందందే గలడు.
నవా : నీదీ వంట్లో గూడా వున్నాడ్ బే!
సిద్ధ : తప్పక ఉన్నాడు.
నవా : దివాన్ జీ! యీడ్కీ వంటిమీన బెమ్మం ఉన్నాడంట. ఆ బెమ్మం గిమ్మం దిగిరావాల. ఈడ్కీ బుద్ధీ వచ్చే వర్కూ కొరడా దెబ్బల్‌కొట్టు.

దివా : చిత్తం హుజూర్! (సిద్ధునివైపు తిరిగి)
ఆహ్హా!హ్హా! హ్హా! హ్హా! సిద్ధా! ఊ ! పిల్వా రమ్మనూ నీదీ గుర్వుకీ (కొడతాడు)

సిద్ధా : తండ్రీ! గురుదేవా వీర బ్రహ్మదేశికా!పాహిమాం!పాహిమాం! దయామయా పరాత్పరా సదాశివా భవా భవా

దివా : అహ్హాహ్హాహ్హా! సిద్ధా!పిల్వా బెమ్మాన్కీ

సిద్ధ : విరాట్ స్వరూప రా బిరాన వీర దేశికా నతుల్

నవా : బేటా! సిద్ధా! నీ వంటి మీద గుర్వా ఏందీ అంటుండాడ్ ? హ్హాహ్హాహ్హా ? దివాన్ కొట్టూ

దివా : (కొడుతూ) ఊఁ.... పిల్వా

సిద్ధ : గురుదేవా! ఈ బాధల భరియింప లేను. రా తండ్రీ ఈ దీనుని రక్షించు. భరింపజాల నీ వ్యథల్ విభాగ ఆగమానతుల్

నవా : అహ్హాహ్హాహ్హా! సిద్ధా!పిల్వా నీ గుర్వుకీ!

దివా : ఊఁ... పిల్వా

సిద్ధ : విరాట్ స్వరూప రాబిరాన వీరదేశికా సతుల్.

నవా - దివా : (వికటాట్టహాసం చేస్తారు)

సిద్ధ : విరాట్ స్వరూప రాబిరాన వీరదేశికానతుల్

**(ఉచ్ఛై స్వరంతో)**

పరమగురూ! వీరబ్రహ్మేంద్ర ప్రభూ! రక్షమాం రక్షమాం!

**(కన్నులు మిరుమిట్లు గొలిపే మెరుపులువచ్చి భయంకరమైన ధ్వని పుడుతుంది. రంగస్థలమంతా ఒక్కసారి అంధకారమై మరలా వెలుగు వస్తుంది)**

సిద్ధ : (కనులు మూసికొని)
ఓం వీరబ్రహ్మణే నమః
ఓం వీరబ్రహ్మణే నమః
ఓం వీరబ్రహ్మణే నమః

నవా : దివాన్‌జీ! ఏందీ జర్గిందీ!మాకీ ఏందీ కన్పించడంలేద్. నీకీ అగపడ్తా వుందా ?

దివా : హుజూర్! నాకీ సూపు కన్పించడంలేద్! సిద్ధయా మన్కీ మంత్రం పెట్టిండు.

భటు : హుజూర్ మాకీ కూడ ఏందీ కన్పింటంలేదు.

నవా : బేటా!సిద్ధయ్యా! నీదీ గొప్పతనం తెల్సిందీ నాకీ మన్నించు సిద్ధా! నాకీ సూపు తెప్పించు ఎవురూ అక్డా!

భటు : జీ! హుజూర్!

నవా : సిద్దయ్యకీ కట్లూ ఇప్పండి

భటు : (కట్లు విప్పుతారు)

సిద్ధ : నాయనలారా! నేను చెప్పినట్లు చేయుడు మీకు చూపు వచ్చును.

నవా : సెప్పు! సిద్దయ్యా! ఏందీ సెయ్యమంటే అదీ సేస్తాం.

సిద్ధ : మా గురుదేవుల పవిత్ర నామమును జపింపుడు.

దివా : ఎట్లా సేయవాలె సిద్ధా!

సిద్ధ : జై బోలో! శ్రీ విరాట్ పోతులూరి వీరబ్రహ్మేంద్రస్వాములవారికి

నవా- దివా: జై.....

సిద్ధ : జై వీరబ్రహ్మజై గోవిందమాంబజై

నవా-దివా : జై వీర బ్రహ్మజై గోవింద మాంబజై

నవా : అరే అల్లా! నాకీ సూపూ వచ్చిందీ దివాన్ నీకీకూడా వచ్చిందా ?

దివా : నీకీ కూడా సూపూ వచ్చిందీహుజూర్

భటు : మాకీ కూడ వచ్చిందీ హుజూర్

నవా : సిద్ధా! నిజంగా నీ కాడనే ఇన్నీ శక్తుల్ ఉంటే నీదీ గుర్వుకాడా శానా వుండవాలె. మాకీ తప్పుల్ సెమించు సిద్ధా!

సిద్ధ : మనలనందరను క్షమించునది ఆ పోతులూరి వీరబ్రహ్మముగారే వారి పాదములనే ఆశ్రయింపుడు.

నవా : ఎవురూ అక్డా!

భటు : ఒక్కా పూలమాలా తీస్కరా !

భటు : చిత్తం హుజూర్ (నిష్క్రమిస్తారు)

నవా : సిద్ధా! మాది ఒక్కా సిన్నా కోర్కె

భటు : (పూలమాల తెచ్చి యిస్తాడు)

సిద్ధ : ఏమిటో అజ్ఞాపింపుడు జహాపనా!

నవా : పోతులూరి యీరబెమ్మం సాములూ ముందు జరగాబోయే యిసయాలు రాసిన కాలగ్నేనం ఇనవాలెనీ కుసీగా వుంది. దయ సేసి యిన్పించు. ఆ సింహాసనం మీనా కూకోబేటా.

(సిద్దయ్య కూర్చోగా నవాబు సిద్దయ్య మెడలో పూలమాల వేస్తాడు)

సిద్ధ : శ్రీ విరాట్ పోతులూరి వీరబ్రహ్మేంద్రస్వాములవారికి

నవా-దివా-అందరు : జై ........

సిద్ధ : శ్రీస్వాములవారు భూత భవిష్యత్ వర్తమానముల నెరిగిన దివ్య చక్షువులు గలవారు. మీరు వారు చెప్పిన కాలజ్ఞానమును నా మాటలలో చెప్పుచున్నాను. ఆలకింపుడు.

వినరండయా గీత
వినరండయా బ్రహ్మాన్న
నవగీత వినరండయా ॥ విన ॥
శుద్ధి బుద్ధులు గలిగి
శూద్ర సంఘము వెలిగి
యోగులై యాగాలు చేసేరయా
హరిజనుల ఇండ్లలో
హరి జన్మమెత్తేను
దివి నుండి సురలు దిగి వస్తారయా ॥ విన ॥
మంత్ర తంత్రమ్ములకు
మరిపట్టు తప్పేను
దైవమాయలు సన్నగిల్లేనయా
మాన్యులౌ బ్రాహ్మణులు
మాంసభక్షణ సేసి
మాయలో మటుమాయమవుతారయా ॥ విన ॥
కర్మ సిద్ధాంతాలు
ధర్మ సిద్ధాంతాలు
కలియుగమ్ము న కరిగి పోయేనయా
వర్ణసంకరమగును
కలి భయంకరమగును
కరువు కాటకమొచ్చి కాల్చేనయా ॥ విన ॥
నేవచ్చు నందాక
ఇట్టి వింతలు జరుగు
నా భక్తులకు నాశమేలేదయా
కాలజ్ఞానమువిన్న
కలుషమ్ములౌ సున్న
కలియుగమ్మున కలిమి కలిగేనయా ॥ విన ॥
శ్రీమద్విరాట్ పోతులూరి వీరబ్రహ్మేంద్రస్వాములవారికీ

నవా-దివా-అందరూ : జై

నవా : ఎవురూ అక్కా ?

భటు : జీ హుజూర్

నవా : సాములవార్కి ముత్తేల హారాలు, ఎండి బంగారాలు, పట్టు వస్త్రాల్ తీస్కరా!

భటు : చిత్తం హుజూర్ (నిష్క్రమిస్తాడు)

నవా : సిద్దా! మీ గుర్వుగార్కి దర్శనం సేయవాలెననీ ఇష్టంగా వుంది. ఈరబిమ్మం సాముల్ గార్కి నాదీ సలాముల్ అందించు

భటు : (పళ్లెరాన్ని అందిస్తాడు)

నవా : సిద్దా ! సాముల్‌గార్కి నాదీ నజరానాలందించు.

సిద్ధ : శ్రీమద్విరాట్ పోతులూరి వీరబ్రహ్మేంద్ర స్వాములవారికీ

అందరూ : జై .......

**(తెరవాలుతుంది)**

**(ఇది 'సరసకవి కన్నెకంటి రాజమల్లాచారి' విరచిత**

**సంభవామి యుగే యుగే అనే నాటకంలో పంచమాంకం)**

## షష్ఠాంకం

(వీరబ్రహ్మంగారి ఆశ్రమంలో సమాధి ఏర్పాటు చేయబడి ఉంటుంది.

గోవిందమ్మ బ్రహ్మంగార్లు ప్రవేశిస్తారు)

వీర : దేవీ ! ఈనాడు గురువారము. తిధి వైశాఖ శుద్ధ దశమి శ్రేష్ఠమైన వసంత ఋతువులో శ్రేష్ఠములైన తిధివారములు కుదిరినవి. ఈనాటి అభిజిత్ లగ్నమున నేను జీవసమాధిలో ప్రవేశింప వలసి యున్నది. పూవులకై పంపిన సిద్ధుడింకను తిరిగి రాలేదు. కబురు పెట్టిన భక్తులింకను రాలేదు.

గోవిం : స్వామీ నాదొక విన్నపం.

వీర : ఏమి దేవీ నీ సందేహము ?

గోవిం : స్వామీ

భరత ధాత్రిని ప్రభవించు పడతులెల్ల
పసపు కుంకుమ కోరియే బ్రతుకు చుంద్రు
నిముసమైనను మనలేను మిమ్ముబాసి
తెరువు నాకెద్ది హృదయేశతెలుపవయ్య

వీర : దేవీ ? ఎందులకు నీకీ అజ్ఞానము ? సమాధిలో ప్రవేశించుటనగా మరణమను కొంటివా ? ఎంతమాత్రమునుకాదు. లోక కల్యాణము కొరకు మహాతపస్సులోనికేగుచుంటిని. అయినను పసపు కుంకుమ భర్తతోపాటురాదు.

పుట్టినప్పటి నుండియె పుట్టునద్ది
పసపు కుంకుమ పోనేల పతిని గూడి
సుదతి విడువకు మంగళ సూత్రములను.

గోవిం : ప్రభూ ! లోకులు కాకులు మీవంటి మహనీయులు వెన్నంటి చెబితేనే అర్థంచేసి కోవడం అంతంత మాత్రం మీరు లేకుండా ఈ మంగళసూత్రాలు ధరిస్తే పలుమాటలంటారు.

వీర : దేవీ నేను చెప్పు విషయము ధర్మసమ్మతమైనది. మన మనసుకు ధర్మమని తెలిసినచో లోకమునకు వెరచు టెందులకు ? ముందు ముందు స్త్రీ జాతికి స్వాతంత్ర్యము రాబోవుచున్నది. ముండమోపులెల్లరు ముత్తయిదువులగుదురు. స్త్రీలు పెద్ద చదువులు చదివి ఉన్నతోద్యోగములు చేయుదురు.

గోవిం : స్వామీ మీ పాదములు వీడి నేను బ్రతుకలేను.

(పాదాలపై బడి ఏడుస్తుంది)

వీర : దేవీ ! విచారము వలదు. సర్వకాల సర్వావస్థలయందును నేను నీ హృదయముననే నివసించి యుందును.

విశ్వకల్యాణ సిద్ధికై వెడలు చుంటి
భీతి చెందెద వెందుకు బేలవగుచు
దేవి శక్తిస్వరూపిణి వీవటంచు
తెలియజేయుము జగతికి తేటపడగ

(గోవిందయ్య అన్నా జయ్యల ప్రవేశం)

గోవిం : తల్లి దండ్రులకు నమస్కారములు

వీర : శుభయోగమస్తు.

అన్నా : గురుదేవులకు వందనములు

వీర : శుభమస్తు.

గోవింద : నాయనా ! గోవిందయ్యా ! సంచారానికి వెళ్ళిన పోతులూరయ్య ఇంకా తిరిగి రాలేదు. తండ్రిగారు సమాధి ప్రవేశించే ముహూర్తం దగ్గరకు వచ్చింది. పువ్వులకు వెళ్ళిన సిద్ధయ్యకూడా రాలేదు. ఎలా ?

అన్నా : అమ్మా ! అంతా సద్గురు సంకల్పము. సోదరుడు ఈ అదృష్టమునకు నోచుకొనలేదు.

(ముత్తి కక్కయ్య ప్రవేశిస్తారు)

కక్క : దండాలు సామీ దండాలు

ముత్తి : దండాలు సామీ !

అన్నా : గురుదేవా ! లగ్నము సమీపించినది. మీరు సమాధి ప్రవేశము చేయవలయును.

వీర : బిడ్డలారా ! సమాధి ప్రవేశము చేయబోవు ముందు మీతో కొన్ని మాటలు మాట్లాడవలెనని ఉన్నది.

నాయనా గోవిందయ్యా!

గోవిం : ఏమి తండ్రీ !

వీర : మీ మాతృదేవికి చెప్పవలసిన మాటలు ముందే చెప్పితిని. నీవు పెద్ద కుమారుడవు గనుక ఆశ్రమ భారమునీ కప్పగించు చున్నాను.

గోవింద : తండ్రీ !

పెద్ద కొమరుడనేనని ప్రేమ మీర
పెద్ద పదవిని యిచ్చితి రిద్ధిమేలె
ఆశ్రమమ్మును కాపాడు నట్టిశక్తి
యుతుడగానయ్య నేనిక బ్రతుకజాల

వీర : కుమారా ! గోవిందయ్యా ! చింతపడవలదు. నీకీ ఆశ్రమమును నడుప గల శక్తి కలుగగలదు. కులమత భేదములు లేక దేశము నాలుగు చెరగులనుండి యిటకు వచ్చు యాత్రికులు దర్శింతురు. నా మఠము సుప్రసిద్ధ యాత్రా స్థలము కాగలదు. నీ గర్భమునందు. ఈశ్వరమ్మ పార్వతమ్మ గోవిందమ్మ శంకరమ్మ గిరిరాజమ్మ లను పేర్లతో పంచమాతృకలుద్భవింతురు. అందు ఈశ్వరమ్మ నా సిద్ధాంతములు ప్రచారము చేసి నాకీర్తిని నిలువ బెట్టును.

గోవింద : ధన్యుడను తండ్రీ!

అన్నా : గురుదేవా!

కన్న తండ్రివి నీవను కొన్నవాడ
నీవు లేనట్టి మఠమున నిలువలేను
నీడ నీవయి గురుదేవ నిలువవయ్య
నీదు పాదాలె శరణమ్ము నీరజాక్షః

వీర : అన్నాజయ్యా! నా అనంతరము నా మఠమునకు వచ్చు భక్తులకు వేదాంత బోధ చేయుచు తపస్సునాచరింపుము. నాసిద్ధాంతములను లోకమునకు చాటుము. నీవుకైవల్యమును పొందగలవు.

అన్నా : గురుదేవా కృతార్థుడను

కక్క : సామీ మాకేంది సెబుతవ్.

ముత్తి : నీ యసమంటి సామి సమాదిలోకి పోతే మా గతేంది సామీ.

వీర : నాయనా ! కక్కయా ! అమ్మా ! ముత్తీ కులము కంటె గుణమే ప్రధానము అరుంధతి మీ కులములో జన్మించినదే గదా ! ముందు ముందు మీ కులము వారు రాజ్యపాలకులు కాగలరు. మీ కులము నుద్ధరించుటకు ఏకు పట్టెడు వాడుద్భవించును.

శివ గోవింద గోవింద
హరి గోవింద గోవింద

ఉత్తర దేశమున వైశ్యకులమునందు
ఉత్తమ గంధొకడు పుట్టినిమా
హత్తుగ నన్ని దేశముల వారంత
సత్తుగ పూజలు చేసేరుమా

కక్క : దండాలు సామీ !

ముత్తి : సామీ దండాలు

వీర : నాయనలారా ! మరల నేవచ్చు సమయమునకు అనేక వింతలు పుట్టును. నాలుగు వర్ణముల వారు సురాపానము చేయుదురు. దేవాలయములలో అంత్యజాతులు ప్రవేశింతురు. బ్రాహ్మణులు భ్రష్టులగుదురు. వర్ణాంతర వివాహములు మతాంతర వివాహములు జ.రుగును. విశ్వకర్మల వృత్తులు పడిపోవును. బంగారమునకు ధరతగ్గును. స్త్రీలు కొత్తరకములక కోకలు కట్టుదురు. బ్రాహ్మణులకు పీటలు మాలలకు మంచాలు వేయుదురు. నాలుగు వర్ణముల వారి వృత్తులు తారుమారగును. బ్రాహ్మణులు పరభాష నేర్చుకొనుటకై పండెడి భూముల నమ్ము కొందురు. సమతా వాదులు సామ్రాజ్యములేలుదురు. గంగాదేవి అదృశ్యమగును. సూది ముక్కులవారు రాజ్యమేలుదురు. పాతాళ గంగలో నీరింకిపోవును. వాలుగు సముద్రముల మధ్య నున్న ధనమంతయును శ్రీశైలము చేరును. నూటఇరువది తిరుపతులు తిరోహితము లగును. ఆకాశమునకు మానవులెగురుదురు. లోకములు చూడగోరు వారి యత్నములు విఫల మగును. నామఠమున సూర్యచంద్రులున్నంత వరకు వీరనారాయణమ్మ గర్భసంజాతులు ధర్మకర్తలై నన్ను పూజింతురు. మరల నేను వీరజభోగ వసంతరాయలనై ఉద్భవింతును.

వేద మతము మరల విలసిల్లెడిని గాక
కులము మతము లన్ని కలియుగాక
కలిమి లేమి రెండు కలిసి పోవును గాక
మనిషి యగునుగాక మాధవుండు.

ముహూర్తము సమీపించుచున్నది. సమాధి ప్రవేశము చేయుచున్నాను.

గోవిం : సమాధిపై రాతి పలక నుంచుతాడు.

గోవిందమ్మ : (దీపాలు వెలిగిస్తుంది)

అన్నా : (కొబ్బరికాయను కొడతాడు)

(నేపథ్యంలో మంత్ర పుష్పం వినిపిస్తుంది)

(గోవిందమ్మ తక్కినవారు సమాధిపై పువ్వులు చల్లుతారు. పుష్పవృష్టి కురుస్తుంది)

గోవింద : ప్రభూ ! నన్నొంటరి దాన్ని చేసి వెళ్లారా ప్రభూ ? మీరు కనిపించని ఈ ఆశ్రమం వెలవెలా బోతున్నది. మీరు లేని ఒంటరి జీవితాన్ని గడిపే ధైర్యాన్ని ప్రసాదించండి స్వామీ ! (సమాధికి

నమస్కరిస్తుంది) బిడ్డలారా ! తండ్రిగారు చెప్పిన మాటలు విన్నారుగా ? ఈనాటి నుండి వారి అడుగు జాడల్లో నడిచి వారి సిద్ధాంతాలను ప్రచారం చెయ్యండి.

ము : అమ్మగోరూ ! నాదొక్కమనవి.

గోవిం : ఏమిటి ముత్తీ అది ?

ము : సాములోరు రాసిన కాలగ్గేనం పాటలు మీశాత పాడించి యినే వారంటగదమ్మా ! ఆ పాట పాడమ్మా!

అన్నా : అమ్మా ! మాకోరిక కూడా అదే

గోవిం : అమ్మా ! నాయనగారి కాలజ్ఞాన గీతములు మీ కంఠస్వరములో వినవలయునని బిడ్డలము కుతూహల పడుచున్నాము. ఆలపించు జననీ!

గోవింద : బిడ్డలారా ! శ్రీవారి కాలజ్ఞాన గేయాలు పదేపదే పాడుకోవడం వినడం మనందరి అదృష్టంగా భావిస్తున్నాను.

**పాట**

వినరండయా గీత
వినరండయా బ్రహ్మన్న
నవగీత వినరండయా ॥విన॥
మహమ్మారి చెలరేగి
మనుషులను బలిగోరి
బలహీనులను చేసి బలిసేనయా
స్త్రీలు పురుషుల వోలె
జలకేళి చేసేరు
వావివరుసలు వదలి పెడతారయా.
వారి కన్నుల నుండి
వర్షించు రక్తమ్మ
కష్టాలు కలిగేను కలిచరితలో
నడిరేయి సూర్యుండు
నడిచి వచ్చేనయా
నింగి ఎర్రని రంగుదాల్చేనయా ॥విన॥
ఇంద్ర కీలాద్రిపైమ
హేంద్ర జాలము. జరుగు
కనక దుర్గాలయము కట్టెదురుగా

తొమ్మిదీ మూరల
స్త్రీజన్మ మెత్తేను
పాప సంఘవు తలలు
కోసేనయా ॥విన॥
నేవచ్చు నంధాక
ఇట్టి వింతలు జరుగు
నాభక్తులకు నాశమేలేదయా
కాలజ్ఞానము విన్న
కలుషమ్ములొ సున్న
కలియుగమ్మున కలిమి కలిగేనయా ॥విన॥

శ్రీ మద్విరాట్ పోతులూరి వీర బ్రహ్మేంద్ర స్వాముల వారికీ-అందరు : జై.................

(తెరవాలుతుంది)

ఇది 'కవితాకళానిధి' కన్నెకంటి రాజమల్లాచారి ప్రణీతమైన

"సంభవామి యుగే యుగే" అనే నాటకంలో

షష్ఠాంకం.

## సప్తమాంకం

(ప్రదేశం-అరణ్య మార్గం కాలజ్ఞాన గీతం పాడుతూ అన్నాజయ్య ప్రవేశం)

విన రండయా గీత
వినరండయా బ్రహ్మన్న
నవగీత వినరండయా ॥విన॥
రాజులకు రాజులకు
రాజుకొను కలహాలు
కదలకనె కదనాలు చేసేరయా
భువిని వింతలు బుట్టు
చిత్ర చిత్రములుగా
మనిషి దేవుడనంచు పలికేనయా ॥విన॥
ఊరూరి కొక శక్తి
ఉరికి వచ్చును రాత్రి

ఉరికి మేకను బొలి అరచేనయా
ఆ అరుపులకు జనులు
అడలి పోతారయా
కొంద రందున మడిసి పోతారయా ॥విన॥
నే వచ్చు నందాక
ఇట్టి వింతలు జరుగు
నాభక్తులకు నాశమే లేదయా
కాల జ్ఞానము విన్న
కలుషమ్ములౌ సున్న
కలియుగమ్మున కలిమి కలిగేనయా.

(మరో వైపుకు నిష్క్రమిస్తాడు)

సిద్దయ్య : (ప్రవేశించి) అహా! ఏమి ఈ కాంతార సౌందర్యము ! ఈ పూపొదల సౌకుమార్యము అతిరమణీయము ఇప్పుడు సద్గురు పాదపూజకు ఏయే పువ్వులను కోయవలయును. ఈ పువ్వులన్నియు కనులు విచ్చిచూచుచు గురుపాదసేవకు మేము మేమనుచున్నవి.

కోయుదుసన్న జాజులను కోయుదు మొల్లల మల్లెపూవులన్
కోయుదు కింశుకమ్ములను కోయుదు, చంపక కేతకమ్ములన్
కోయుదు కేసరమ్ములను కోయుదు మోదుగ పూల బాళలన్
కోయుదు మాలతీ విరుల కూరిమితో గురు పాదసేవకై

ఇవియేకాదు అట్టడుగున మట్టిలో నుండి నవ్వుతున్న ఈ పువ్వులను కూడ నాగురుదేవుల పాదసన్నిధికి చేర్పవలెను.

గడ్డి పూలు కూడ గణుతికెక్కగవలెన్
తక్కినపూట్టిల తక్కువేమి ?
రంగు తక్కు అంత రంగ మొక్కటిగదా
పూవులన్ని గురుని పూజ కొరకె.

(కోయడాన్ని అభినయించి) ఓహూ ! కుసుమ ములారా ! ఎంత పుణ్యము చేసితిరి. వీర బ్రహ్మేంద్ర స్వాముల వారి పాదసేవ జేయు భాగ్యము కలుగబోవుచున్నది. వీర గురుని పాదపద్మ మలంకరింప బోవు మీ జన్మ ధన్యము. గురుదేవుని పాదముల నాశ్రయింప మీరును తహ తహలాడుచుంటిరా నావైపు జూచి సంతోషముగా నవ్వుటిందులకేనా. గురుదేవుల దివ్యపాద సన్నిదికి ఇప్పుడు మిమ్ముచేర్చెదను.

(పువ్వులు కోసుకొని బయలు దేరబోతాడు. ఇంతలో పెనుగాలి వీస్తుంది. ఉరుములు మెరుపులతో వర్షం ప్రారంభ మవుతుంది.)

ఏమిది ? ఇంతలో ఎంత వానకురియుచున్నది. చూచు చుండగనే మన్ను మిన్న లేకములైనవి.

అబ్బ ఈ ఝుంఝూ మారుతము ప్రళయ కాలమును తలపించుచున్నది. ఈ అంత్యకాలభయద శంపాలతలు కనులకు భ్రమగొల్పుచున్నవి. ఫెళఫెళార్భటులతో మేఘములు సింహ గర్జన చేయుచున్నవి. 'గురువుగారి సమాధి' ప్రవేశవేళకు చేరగలనా ? ఈ భయంకర వర్షము నన్ను ఆశ్రమము చేరనిచ్చునా ? ఈ భవిష్యత్తు నూహించియే కాబోలు వీర బ్రహ్మేంద్ర స్వాముల వారు నన్ను ముహూర్తమునకు రమ్మని రెండవసారి హెచ్చరించినారు. ఈ ప్రకృతి వైపరీత్యము గడచి గట్టెక్కి నేను గురుదేవుల పద సన్నిధికి చేరినప్పటికి గదా ? ఏమైనను సరే ముహూర్త సమయమునకు వెళ్లవలసినదే.

**(రెండడుగులు ముందుకు వేసి)**

అయ్యో ! ఏమి ఈ ప్రవాహము నేను వచ్చునప్పుడు లేదు గదా ఇది నిన్న సంకల్పమేనా ? ఎందుకు నన్నిట్లు పరీక్షించు చుంటిరి. దేవీ ! గంగా భావానీ గురు పూజకై వెళ్లుచున్న నన్ను ఎందుకమ్మా ? అడ్డగించుచుంటివి ?

స్వామీ : వరుణ దేవా ? కరుణమాని నాపై యిట్లు కుంభవృష్టి నేల కురిపించు చుంటివి ? తల్లీ ! గంగాభవానీ!

**పాట**

తెరువీయవే వరమీయవే
పరమగురు సన్నిధికి
పరుగిడగ వడివడిగ ॥తెరు॥
కల్మష విభంగ కరుణాంతరంగ
పావన వారి తరంగా
చెంగలించి నాముంగల పొంగక
తొలంగవే సురగంగా ॥తెరు॥
నా ఆశయమ్ము కానీకు వమ్మ
కరుణించవమ్మ గంగా ॥తెరు॥
తల్లివి నీవైతే కల్పవల్లివి నీవైతే
గుణ వల్లివి నీవైతే
కల్లోలిని నను కనికరించు
నావల్ల నేరమేమే ॥తెరు॥
వరుణ దేవ కారుణ్య భావ
దయజూపరావదేవా
వాయుదేవ వర మీయవయ్య
తెరు వీయవయ్య దేవా ॥తెరు॥

**(వర్షం వెలిసి దారి ఏర్పడుతుంది)**

ఆహా ఏమి నా భాగ్యము ? గాలి దేవుడు జాలిజూపినాడు ? వరుణ దేవుడు కరుణించినాడు గంగా తరంగిణి నా పాలిటి కరుణా తరంగిణి యైనది. ఇక వేగముగా గురు సన్నిధికి చేరవలెను

**(బయలు దేరబోతాడు నేపధ్యం నుండి తత్వం వినిపిస్తుంది. అన్నా జయ్య ప్రవేశిస్తాడు)**

అన్నా : నాయనా ! సిద్దయ్యా ! నీవింకను ఇక్కడ ఏమి చేయుచుంటివి ?

సిద్ధ : గురుదేవుని పాదపూజకై పువ్వులేరుచుంటివి.

అన్నా : ఇంకను ఎవరి కోసమీ పువ్వులు ?

సిద్ధ : అదేమి స్వామీ ! అట్లను చుంటిరి ?

అన్నా : నీకింకను తెలియ నట్లున్నది గురుదేవులు సమాధి ప్రవేశము చేసిరి.

సిద్ధ : (హతాసుడై) ఆ... ఏమి ? గురుదేవులు సమాధి ప్రవేశము చేసినారా ? నేనేమి పాపము చేసితిని ? మీ యెడనేనెట్టి అపరాధమును చేయనైతిని గదా ! ఎందుకు స్వామీ నన్నీ విధముగా శిక్షించితిరి ?

అన్నా : సిద్దయ్యా ! ఏమి నీ వెర్రి ? గురువు గారు చెప్పిన విషయమును సరిగ అర్థము చేసికొన లేక పోయితివి పువ్వులనగా నేమను కొంటివి ?

అష్ట విధముల పుష్పమ్ము లవని గలవు
అవి యహింసాదిగుణములే యరసి చూడ
అట్టి పువ్వుల గురుదేవు డాదరించు
తెలిసి కొనవయ్య పువ్వుల తీరు లి వియె

సిద్ధ : ఏమీ ! పువ్వులనగా నివియా ? ఎంత మోసపోయితిని ?

అన్నా : సిద్ధా ! నీవికనైనను ఆలస్యము చేయక గురుదేవుల సమాధిని దర్శింపుము.

సిద్ధ : స్వామీ ఇదిగో ఇప్పుడే గురువర్యుల సమాధికడకేగెదను.

(నిష్క్రమిస్తాడు)

అన్నా : నమో వీరబ్రహ్మదేశికా నమోన్నమః

వినరండయా గీత
వినరండయా
బ్రహ్మన్న నవగీత
వినరండయా
శేషా చలమునుండి
భూమి కేతువువోలె
ఒక శక్తి చకచకా వచ్చేనయా.
పాతాళ గంగలో
జలక మాడగ జూచి
మార్గమున మనుషులు మడిసేరయా.
ఉత్తరము ఉరిమేను
దక్షిణము మెరిసేను
ఎండ వెన్నెవోలె ఉండేనయా

బెంగుళూరున వింత
చోద్యమ్ము కలిగేను
ఆ చోద్యముకు ముందు ఉరిమేనయా
శుద్ధ విదియకు పెద్ద
పిడుగులు పడి పడును
నాల్గు నిలువుల నరులు నడిచేరయా
అప్పుడనువులచేత
పట్టుకొని మానవులు
ఉత్తరముగా ఉరికి పోతారయా
నేవచ్చునండాక
ఇట్టి వింతలు జరుగు
నా భక్తులకు నాశమే లేదయా
కాలజ్ఞానము విన్న
కలుషమ్ము లౌసున్న
కలియుగమ్మున కలిమి కలిగేనయా !

(తెరవాలుతుంది)

ఇది సహజ కవి 'మధురగాయక' కన్నెకంటి రాజమల్లాచారి రచిత

సంభవామి యుగేయుగే అనే నాటకంలో సప్తమాంకం

## అష్టమాంకం

(వీర బ్రహ్మేంద్ర స్వామి సమాధికడ గోవిందమ్మ కూర్చొని వుంటుంది. గోవిందయ్య దీపాలు వెలిగిస్తూ వుంటాడు. పోతులూరయ్య సంకీర్తన చేస్తూ వుంటాడు. తక్కిన వారనుసరిస్తారు)

పాట

జనగణమన అధినాయక జయహే
జగములనేలే ఏలిక జయహే
జయహే జయహే ॥జ॥
కులభేదమ్ముల నెంచని వాడా
కలవాదము నెదురించిన ప్రోడా
యోగశాస్త్రములు తెలిసిన స్వామీ
అనురాగ సూత్రములు తెలిపిన స్వామీ ॥జ॥
కాలజ్ఞానము వ్రాసిన దేవా

అజ్ఞానమ్ము౯ను కోసిన దేవా
కలికలుషాలను త్రుంచిన దేవా
విలువౌ కవితల పంచిన దేవా ॥జ॥
సామ్యవాదమే నీవేదముగా
స్వామి చేసితివి బోధలుగా
వీరబ్రహ్మ యతీ సుమతినీ
వరములు పొందెను వసుమతీ ॥జ॥
శ్రీవీరాట్ పోతులూరి వీరబ్రహ్మేంద్ర స్వాముల వారికీ

అందరు : జై

(సిద్దయ్య ప్రవేశించి సమాధిపై బడి ఏడుస్తూ)

తండ్రీ : వీర బ్రహ్మేంద్ర స్వామీ! సమాధి నిష్ఠను పొందితిరా ? మీరే నా సర్వస్వమని ఎంచితినే. పన్నెండు సంవత్సరములు రేయింబవళ్లు తమను సేవించితినే ఇదేనా మీరు నాపై చూపించిన దయ ? నాపై కినుక వహించి నిర్దాక్షిణ్యముగా నేను లేని సమయముననే సమాధి ప్రవేశము చేసితిరా గురుదేవాః ఇంకను నాకెన్నియో రహస్యములను తెలిపెదరని ఆశించితిని నా ఆశలన్నియు అడియాసలైనవి. మీ సొంత కుమారుల కన్నను నన్ను మిన్నగా ప్రేమించితిరే ! ఆ ప్రేమ ఏమయినది? ప్రభూః నేనేమి పాపము చేసితిని తండ్రీ నన్నెందుల కిట్లు శిక్షించితివి ?

(గోవిందమ్మ వేపు చూసి)

అమ్మా : గోవిందమ్మా! ఎందులకమ్మా ! నాపై నిర్ధయ వహించితిరి. తండ్రి గారికి మీరైన ఈ సిద్దుని విషయము గుర్తు చేయక పోయితిరి గదమ్మా! ఎందుకమ్మా! నాపైదయ మాలితిరి ?

గోవింద : నాయనా ! సిద్దయ్యా! తండ్రి గారి పరిపూర్ణ కటాక్షం నీపై వుంది. నీవు సమయానికి రాలేక పోయావని వారెంతో బాధపడ్డారు. కానీ లగ్నం దాటి పోతున్నదని గత్యంతరం లేక సమాధిలో ప్రవేశించారు. ఇక నీవు తెచ్చిన పూలతో గురువుగారి సమాధిని పూజించి మరలిపొమ్ము.

శాంత్య హింసలనెడి చక్కని పూష్పాలు
గురుని పాదసేవ కొఱకు గలవు
అట్టి పూల తోడ నర్చన సలుపుచు
వీర గురుని చేరు వెఱవుగనుము

(సమాధికి నమస్కరించి నిష్క్రమిస్తుంది)

సిద్ధ : సోదరా గోవిందయాచార్యా ; గురుదేవులు సమాధి ప్రవేశించు సమయమున మీరైన గుర్తుచేయక పోయితిరే ? పూలకైపోయితినే ? నాపైన కరుణ మానితిరా ? ఎందులకిట్లు చేసితిరి సోదరా ?

గోవింద : తమ్ముడూ ! సిద్దయ్యా ; తండ్రిగారికి గుర్తు చేయుటకు మన మెంత వారము. ఇది యంతయు వారి సంకల్పము ననుసరించియే జరిగినది. సర్వమెరింగిన నీవే ఇట్లన్నచోనేనేమి చెప్పుదును ? మనసు కుదుట పరచుకొని తండ్రిగారి సమాధిని నీవు తెచ్చిన పూలతో పూజింపుము.

సత్య ధర్మములను చక్కని పుష్పాలు
వీరగురుని పూజకొఱకు గలవు
అట్టి పూలతోడ నర్చన చేయుచు
గురునిజేరుకొనెడి గుర్తుగనుము.

(సమాధికి నమస్కరించి నిష్క్రమిస్తాడు)

సిద్ధి : సోదరా! పోతులూరయ్యా! నన్ను మీ తోబుట్టువుగా భావించితిరిగదా! తండ్రిగారి సన్నిధిలో ఎన్నియో మారులు నన్ను నాగుణముల నెంతయో ప్రశంసించితిరే! ఈ సిద్ధయ్య మీకడుపున బుట్టిన మాకంటె మిన్నయని పలుమాటలు పలికితిరే ? ఆ కరుణ ఏమైనదయ్యా! తండ్రిగారితో ఒక్కమాట అనలేక పోయితిరా?

పోతు : సిద్ధయ్యా ; నేనును నీవంటి అభాగ్యుడనే.

తండ్రి నిష్ఠను పొందిన తరుణ మందు
నేను సైతము నీవలె నిచట లేను
మాతృదేవిని తిట్టి సమాధి తెరచి
నందులకు దుష్ఫలితము నంది కొంటి.

నేను చేసిన దోషమునకు తండ్రిగారు నన్ను తీవ్రముగా శపించిరి. నేను పాపపరిహారార్థము తపముగావించుటకై వనవాసమునకు వెళ్లుచుంటిని నీవును ఇంటికి వెళ్లి గృహస్థాశ్రమమును స్వీకరింపుము.

(సమాధికి నమస్కరించి నిష్క్రమిస్తాడు)

సిద్ధ : కక్కయ్యా ; ఎంత అదృష్ట వంతుడవయ్యా ;

అమ్మా : ముత్తీ ; ఎంత పుణ్యాత్మురాలవమ్మా; స్వాములవారి అంతిమ సందేశమును వినెడి భాగ్యము మీకు లభించినది. పూర్వజన్మమున ఎన్ని పుణ్యములు చేసితిరోగదా! మీరైన నావిషయమును గుర్తు చేయలేక పోయితిరా;

ముత్తి : ఏడవ మాక సిద్ధా ! జరిగిన దానికి ఏంజేత్తం ? కాత్తముందొత్తే సాములోర్ని సూసీ వాడివే.

కక్క : సిద్ధయ్యా ! నీయసమంటి బక్తులకి బగమంతుడు కనిపిత్తడంట ఈడనే కూకోని సామని గట్టిగా పిలువు. వచ్చి నీతో మాట్లాడతడు. మేం ఎల్లొత్తం. ముత్తీ ఎల్దాం పదవే. సాములోరికి దణ్ణంపెట్టు.

(సమాధికి నమస్కరించి నిష్క్రమిస్తారు)

సిద్ధ : తండ్రీ! వీరనారాయణా ఆశ్రిత జనాధీనా ! దయామయా ! సచ్చిదానంద స్వరూపా ! అఖిలాండకోటి బ్రహ్మాండ నాయకా; నన్ను రక్షించు స్వామీ ఈ దీనుని కటాక్షించు ఒక్కసారి నీదర్శన

భాగ్యమును కలిగించు.

రావయ్య బ్రహ్మమా రావయ్య ఒకసారి
నీ దివ్యరూపమ్ము నేను కనగ
రావయ్య బ్రహ్మమా రావయ్య ఒకసారి
నీ దివ్య భాషణల్నేను వినగ
రావయ్య బ్రహ్మ మా రావయ్య ఒకసారి
నీ శుభాశీస్సుల నిమ్ము వేగ
రావయ్య బ్రహ్మమా రావయ్య ఒకసారి
నీ దయామృతమ్ము నిమ్ముతాగ
కనుల పండుగ కలిగింప కదలిరమ్ము
వీనులకు విందు గూర్పంగ వెడలిరమ్ము
రమ్ము రమ్ముగ నిముబ్రహ్మగ బ్రహ్మ తేజ
వీరనారాయణా నిష్ఠ విడిచి రమ్ము.

తంగ్రీ : వీరబ్రహ్మదేశికా ! దేవాధిదేవా నేను చేసిన నేరమేమియును లేదే. ఎందులకింత భయంకర శిక్ష విధించితిరి. మీ దివ్య పాదార విందములు భజించుయోగ మింకలేదా ? తమ వియోగఖేదము దుస్సహముగ నున్నది. మీ కరుణా కటాక్ష వీక్షణములను ప్రసరింప చేయనిదే దుఃఖాగ్నిలో మండుచున్న నాహృదయము చల్లబడదు. స్వామీ! ఎందులకిట్లు పుష్పముల నెపము బెట్టితిరి! సిద్ధా; నాసమాధి ప్రవేశ వేళ నీ వుండ తగవురా అని ఒక్కమాట అనిన సరిపోయెడిదిగదా! గురుదేవా ఈనాడు మీరు పలికి నవి మాయమాటలా ? అబద్ధము లాడ వలసిన అగత్యము మీకేల స్వామి ? దివ్య మంత్రోపదేశము చేయుదు మంటిరే నా ఆశల నన్నింటిని అడియాసలు చేసితిరా స్వామీ ? మీరు జీవసమాధిలో ప్రవేశించుచుండ చూచిన వారెంతధన్యులు మంగళ నీరాజనములతో తమరు సమాధి నిష్ఠలో ప్రవేశించు శుభ సన్నివేశమును తిలకించి కన్నుల పండుగచేసి కొన్న వారెంత ధన్యులు ? నాకిట్టి దురదృష్టము నెందులకు ప్రసాదించితిరి ? స్వామీ ప్రభూ ? వీర బ్రహ్మదేశికా !నన్ను కరుణించి ఒక్కసారి ఒక్కసారి మీ దర్శన భాగ్యమును కలిగింపుడు. ఒక్కసారి సిద్ధా అనిపిలిచి మీ కరుణారసమును నాపై చిలకరింపుడు స్వామీ నన్ను కనికరింపుడు స్వామీ నాపైదయరాదా ? నాకు కనిపింపరాదా ?

ఎందుకు నాపయిన్ కినుక లెందుకు పంతములేలజాలముల్

ఎందులకీ పరాకులిక యెందుకు నన్ను పరీక్షసేయుగా
ఎందుకు కుందజేతు విటులేమిది ? నాతొలి బామ నీవునా
ముందుకు రానిచో శిరము మోదుక చత్తు సమాధిరాతిపై

(రాతిపై తల పగులగొట్టు బోతాడు)

ఓం వీర గురవే నమః
ఓం వీర గురవే నమః
ఓం వీర గురవే నమః

వీర : (సమాధి నుండి బయటకు వచ్చి)
ఆగు మాగుము సిద్దయ్య త్యాగమేల
చింతవీడుము భవదీయ స్వాంతమందు
నెనయు భక్తికి మెచ్చితి నీతపమ్ము
సిద్ధి పొందెను నేటికి శిష్యజయము.

సిద్ద : తండ్రీ ! వీరబ్రహ్మేదేశికా ! అనంతకోటి సూర్యమండల ప్రకాశా! ఆది మధ్యాంతరహితా! దేవవేదస్వరూపా! నన్ను కనికరించితివా తండ్రీ ! శ్రీ వీరనారాయణా! వేదపారాయణా! దీనచింతామణీ! యోగి చూడామ ణీ! విశ్వకర్తా నమో ! విశ్వభర్తా ! నమో విశ్వకర్మా ; నమోదేవతాధీశ ! గోవిందమావల్లభా! సామ్యవాదీ ! మహామంత్రవేదీ ! త్రిమూర్తి స్వరూపా! మహాత్మా ! కవీశా! నిరాకార గంభీర యోధీర! నీశక్తులెన్నంగ నే నెంత వాడన్ ! మహాశిల్పి వర్యా ! సదానిన్ను సేవింతు పూజింతు నీ భూమిలో జాతి భేదమ్ములన్ మాన్పి ఈ జాతులన్నింటినే కంబుగా జేయ నద్వైత సిద్ధాంతమున్ జెప్పి విశ్వమ్మునన్ దేవ దేవుండవై విశ్వకల్యాణమున్ జేసి దీవింపుమా కోర్కెలీడేర్పుమా ! మోక్ష మిప్పింపుమా ! పోతు లూర్వంశ పాధోధి చంద్రా ! విదాడ్వీర యోగీ నమస్తే నమస్తే నమః

స్వామీ ! నాచిత్తము ! నాచిత్తము అన్యధా యత్తము కానీక సద్భక్తిని నిష్కామ కర్మను ప్రసాదించి దీవింపుము.

వీర : సిద్దయ్యా ! నేనిది వరకే నీకు పర తత్వము నుపదేశించితిని మరల ఈ సందేహమేమి?

సిద్ద : తండ్రీ! మీకృప వలన ఆత్మ జ్ఞానమును పొందితిని కాని మీయందలి మమకారముచే మాయకులోనై దుఃఖమును పొందుచుంటిని. మీ దర్శన భాగ్యము వలన నా పాపములు పటా పంచలైనవి. ఈ మానవ జన్మపై నాకు విసుగు జనించినది. పురాకృత ఋణము లింకను తీరలేదు. ఎట్లు తీరునో సెలవిండు స్వామి.

వీర : నాయనా ! నీవీ తనువు వదలిన పిమ్మట ఉత్తర దేశమున వైశ్యుని యింట జన్మింప గలవు. వైశ్యుల ధనమును గురించి దుష్టసంపాదనను గురించి వారిపై నీకు ద్వేషము గలదు. అందువలన నీవు వారి కులమున జన్మింతువు. తొలి జన్మమున క్షత్రియ మదముతో ప్రజలను పీడించితివిగాన రాజకీయ శ్రమలను పొందుదువు. ఈ జన్మమునందలి కుల లక్షణములతో ఏకు పట్టెదవు. మేక పాలను తాగెదవు. పూర్వజన్మమున నీవు హత్య చేసిన గోవు మానవ జన్మమెత్తి మతమౌఢ్యముతో నిన్ను మారణా యుధముల తో చంపును. నానామ స్మరణ చేయుచు తనువు వీడెద్రవు. లోకమున మహాత్ముడను ప్రసిద్ధి పొందగలవు. సిద్ధా! ఇదిగో ఈ యోగ దండమును కమండలమును పాదుకలను తీసికొనుము. గృహమునకు వెళ్లి తల్లి దండ్రుల అభీష్టమును దీర్చి రాజయోగివై వర్ధిల్లుము.

సిద్ధ : ధన్యుడను గురుదేవా ! ధన్యుడను.

కువలయమ్ము నందు కుల మతభేదాలు
కలుగ నట్టి రోజు కలుగుగాక!
ధరణి యందు ప్రజలు ధర్మము తప్పక
కలిసి బ్రతుకు రోజు కలుగుగాక!
గాలి నేల నీరు గాగల ప్రకృతి
వనరులెల్ల జనుల వశము లగుచు
సామ్యవాద రథము సాగివచ్చును గాక!
పంట మూడు కార్లు పండుగాక
అవనిలోని, ప్రజల కానంద మగుగాక!
మనిషి యగును గాక మాధవుండు.

వీర : సర్వే జనాస్సుఖినో భవంతు
సమస్త సన్మంగళాని సంతు
తమసోమా జ్యోతిర్గమయా
మృత్యోర్మా మృతంగమయా

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః

(తెర వాలుతుంది)

ఇది శ్రీ విరాడ్విశ్వ కర్మాన్వయ కలశ

పాదోధి కుముద మిత్ర కశ్యప

ఋషి గోత్ర సానగ సూత్ర

పంచార్షేయ ప్రవరాన్విత పవిత్ర

కన్నెకంటి రాజలింగాచార్య పౌత్ర

పల్నాటి సోదరకవి.

చినలింగాచార్య సుబ్బమాంబా పుత్ర

కవితా సరోజ హృదయమిత్ర

'విద్యావిశారద' సాహిత్య సరస్వతి 'అభినవజయదేవ'

'మధురకవి' 'సరసకవి' 'సహజనటనాధురీణ'

ఇత్యాది బిరుదపాత్ర

రాజ మల్లాచార్య విరచిత

సంభవామి యుగే.....అనే

శ్రీ మద్విరాట్ పోతులూరి వీరబ్రహ్మేంద్ర స్వాముల వారి జీవిత చరిత్ర

నాటకం

సర్వం

సంపూర్ణం.